# కమ్యూనిజం

అక్టోబరు - 1988

* ఇరాన్ - ఇరాక్‌ల సంఘర్షణ
* సంస్కృతి, కళల స్థానం
* ప్రచార పద్ధతులు - నిర్వహణ
* సోషలిజం నూతన రూపం
* చౌ ఎన్ లై
* జాతీయ సమితి తీర్మానం

# కమ్యూనిజం

సంపుటి : 13 ★ అక్టోబరు 1988 ★ సంచిక : 6

ఈ సంచికలో :

# COMMUNISM (Telugu Monthly)

Volume : 13 October 1988 ISSUE No. 6

*Contents :*



2

సంపాదకవర్గం :

ఈడ్పుగంటి నాగేశ్వరరావు
(సంపాదకుడు)

ఏటుకూరి బలరామమూర్తి

డి.వి.వి.యస్. వర్మ

# కమ్యూనిజం

విడి ప్రతి — రూ. 2.00
సంవత్సర చందా — రూ. 20/-

# వరల్డ్ మార్క్సిస్టు రివ్యూ

అరబిక్, బెంగాలీ, బల్గేరియన్, జక్, డేనిష్, ఇంగ్లీష్, ఫిన్నిష్, ఫ్రెంచ్, జర్మన్, గ్రీక్, గుజరాతి, హిబ్రూ, హిందీ, హంగేరియన్, ఇండోనీషియన్, ఇటాలియన్, జపనీస్, మళయాళం, మంగోలియన్, నార్వేజియన్, ఒరియా, పర్షియన్, పోలిష్, పోర్చుగీస్, పంజాబి, రుమేనియన్, రష్యన్, సింహళీష్, స్పానిష్, స్వీడిష్, టాగాలోగ్, తమిళం, తెలుగు, టర్కిష్, వియత్నామీస్ భాషలలో కూడ వెలువడుతున్నది.

# విజయం మనదే

## యాసర్ అరాఫత్

(పాలస్తీనా విమోచన సంస్థ కార్యవర్గ అధ్యక్షులు)

పాలస్తీనియన్ల పోరాటం అరబ్ జాతి, మధ్య ఆసియా మొత్తంగా అంతర్జాతీయ పరిస్థితి అభివృద్ధిలో ఒక నూతనదశకు చేరుకున్నాయి. ఉన్మత్త ఆయుధపోటీ తెచ్చిపెట్టిన అణువిపత్తు ఈ భూమండలంలోని జీవనానికి ప్రమాదాన్ని కలిగిస్తున్నది. ఈ ప్రపంచం ప్రేలిపోనున్న అగ్నిపర్వతంలా తయారైంది.

అత్యంత ఆధునికమైన కంప్యూటర్లు సైతం పొరపాట్లు చేస్తాయి. ఫలితం యేమిటి? అణుయుద్ధ ప్రజ్వలన. ఈ దృష్టితో చూసినప్పుడు మాస్కోలో జరిగిన సోవియట్ - అమెరికా శిఖరాగ్రసభ చాలా ప్రాముఖ్యమైంది. ఎందుకంటే యిది ఉద్రిక్తతోపశమనానికి కొత్త ప్రోత్సాహాన్ని యిచ్చింది.

ఎరిక్ హోనేకర్ ఆహ్వానం మీదట బెర్లిన్‌లో జరిగిన అణ్వస్త్రరహిత మండలాల అంతర్జాతీయ సమావేశానికి హాజరైనాను. ఒక్క జి.డి.ఆర్, యితర సోషలిస్టు దేశాలు మాత్రమే గాక పశ్చిమ యూరోప్, ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా, అరబ్ దేశాలలోని అనేక రాజకీయ పార్టీలు కూడా అలాంటి మండలాలను కోరుతున్నాయని అనేకమంది వక్తలు ఈ మహాసభలో స్పష్టం చేశారు.

అణ్వాయుధాల విషయాలపై యీ మహాసభ అబు అమర్ (అరాఫత్ పార్టీ) పనిచేస్తున్న తీరుపట్ల పాత్రికేయులు ఆశ్చర్యం ప్రకటించారు. ఈ విషయంలో మాకు చాలా ఆసక్తి వుందనీ, ఎందుకంటే మధ్య ఆసియాలోని అతి పెద్ద ఆయుధాగారాలతో పాలస్తీనా ప్రజలు తలపడుతున్నారని వారికి నేను చెప్పాను. ఇజ్రాయల్‌కు 120 అణ్వాయుధ క్షిపణులున్నాయి. మిస్సైళ్ల తయారీ సాంకేతిక విజ్ఞానాన్ని (యూరప్, సోవియట్ యూనియన్, సెంట్రల్ ఆఫ్రికా, భారతదేశం, పాకిస్తాన్‌లలోని లక్ష్యాలకు చేరగల సుదీర్ఘశ్రేణి మిస్సైళ్ల అభివృద్ధిలో) రూపొందించడంలో, ఈ ప్రాంతంలోని తన మిత్రదేశమైన ఇజ్రాయల్‌కు అమెరికా శాస్త్ర, సాంకేతికసహాయాన్ని అందజేస్తున్నదృష్ట్యా, యీ సమస్యకు సంబంధించిన

ప్రాముఖ్యతలేమిటో స్పష్టం అవుతున్నదని అణుభౌతిక శాస్త్రవేత్త మొర్దెహాయ్ పేర్కొన్నారు. ఇజ్రాయెల్ మహోత్సాహంలో నక్షత్రయుద్ధ కార్యక్రమంలో చేరింది. అమెరికాలో వ్యూహాత్మక సహకార ఒప్పందంపై యిటీవల సంతకం చేసింది. ఆ విధంగా నాటో సభ్యదేశాలతో సమానమైన ప్రతిపత్తిని సంతరించుకొన్నది.

పాలస్తీనా ప్రజల విప్లవం ప్రపంచ వ్యాపిత విమోచనక్రమంలో భాగం. ప్రపంచంలో ఎక్కడైనా స్వేచ్ఛ, ప్రజాస్వామ్యం, ప్రగతి అన్న ఉన్నత భావాల కోసం పోరాడే యోధులకు కలిగే ప్రమాదం మాకు కలిగే ప్రమాదమే. మాకు కలిగే ప్రమాదంపైన పేర్కొన్న ఉన్నతభావాలకు కలిగే ప్రమాదమే. ప్రిటోరియా జాత్యహంకారులు, జాత్యహంకార యూదు ప్రభుత్వం మధ్య సహకారం, ప్రత్యేకంగా అణుభౌతిక శాస్త్రంలో సహకారం యీ ప్రమాదంలో భాగమే అవుతుంది.

మనుగడకోసం జీవన్మరణ పోరాటం సాగిస్తున్న పాలస్తీనా అరబ్ ప్రజలు ప్రపంచంలోని సకల చిత్తశుద్ధి కలిగిన, స్వేచ్ఛాకాముక ప్రజల ప్రయోజనాలను సమున్నతంగా వుంచుతున్నారు అందుకే మేము అంటున్నాము : "మా విప్లవానికి పాలస్తీనా ప్రజల ముఖం వుంది, అరబ్ హృదయం వుంది, అంతర్జాతీయ స్వభావం వుంది."

ప్రపంచంలోని విముక్తి ఉద్యమాలలో సహకరించాలని మేమెంతగానో కోరుకొంటున్నాం; మా సహకారం వైవిధ్యం గలది, లాటిన్, సెంట్రల్ అమెరికాలకు, ఆసియా, ఆఫ్రికాలకు యిది చేరుతుంది; పాలస్తీనా విప్లవం బాగా వ్రేళ్ళూనుకున్నటువంటిది; స్వాతంత్ర్య మహోదరువుకు మేము ఒక శాఖ మాత్రమే.

మేము దారుణమైన కష్టాలను ఎదిరించి పోరాడుతున్నాం. మాకు వ్యతిరేకంగా అనేక కుట్రలు పన్నుతున్నారు. శత్రువును ఎదిరించే సమయంలో మేము కొంత ఒంటరిగా వుంటున్నాం. మా యుద్ధానికి కాల్పుల విరమణ లేదు; అది, సైనిక, ప్రచార, ఆర్థికరంగాలలో జరుగుతున్నది; ఇది పాలస్తీనా ప్రజల జీవన్మరణ సమస్య.

1982 లో ఇజ్రాయెల్, లెబనాన్‌పై దాడిచేసినప్పుడు, మధ్య ఆసియా సంఘర్షణ చరిత్రలో అత్యంత ముఖ్యమైన శత్రువు దాడిని మేము ఎదుర్కొనవలసి వచ్చింది. ప్రప్రథమంగా ఇజ్రాయెల్ ఒకే యుద్ధరంగంలో 8.5 నుండి 11.5 డివిజన్లను మోహరించింది. 88 రోజులపాటు ఆ దళాలను అక్కడే వుంచింది. మిగిలిన మూడు డివిజన్లలో ఒకటిన్నర డివిజన్‌ను గోలన్ పర్వత ప్రాంతాలమీద మోహరించింది. ఒక డివిజన్‌ను 600 కిలోమీటర్ల పొడవుకల జోర్డాన్ రంగంలో వుంచింది. ఒక డివిజన్‌ను రిజర్వులో వుంచుకొన్నది. ఇది ఇజ్రాయెల్ జరిపిన

సుదీర్ఘ సైనిక ఉద్యమం. సి.ఐ.ఎ. లెక్కల ప్రకారం, మధ్య ఆసియా సంఘర్షణ మొత్తం చరిత్రలో దాని మొత్తం మానవ నష్టంకంటే ఇజ్రాయిల్ ఎక్కువగా మానవనష్టాలకు పొందింది.

బీరుట్‌నుండి మేము ఉపసంహరించుకున్న తరువాత, అప్పటి పెంటగన్ అధిపతి కాస్పర్ వీన్‌బర్గర్ ఇజ్రాయిల్ నాయకత్వానికి కృతజ్ఞతలు తెలియజేశారు. ఎందుకో తెలుసా? క్లష్టర్, ఫాస్ఫరస్, వక్యూమ్, ఫ్రాగ్‌మెంటేషన్, పెల్లెట్, నీడిల్, గాస్, నాపాం బాంబులు, తూటాలవంటి ఆధునిక అమెరికా ఆయుధాలను పరీక్ష చేయటానికి లెబనాన్ పోరాటాన్ని ఉపయోగించే అవకాశం కల్పించబడిందట. నరాలను దెబ్బతీసే గాస్‌లను, ఆధునికమైన అమెరికన్ లేజర్ చోదిత బాంబులను కూడా యిక్కడ ఉపయోగించారు.

1982 లో మేము, మా లెబనాన్ సహయోధులు పదుల వేలమందిని పోగొట్టుకున్నాము. వేలమంది గాయపడ్డారు. పదుల వేలమంది పాలస్తీనియన్లు విమాన దాడుల్లో మరణించారు.

లెబనాన్‌పై దాడి పి.యల్.ఓ. వ్యవస్థను బద్దలుచేసిందని ఆ సమయంలో అమెరికా అధ్యక్షుడు రీగన్ నంబరాల మాయలు పలికారు. పాలస్తీనా ప్రతిఘటనోద్యమాన్ని పూర్తిగా తుడిచిపెట్టేటందుకు వీలుగా మా సంస్థలో మా శత్రువులు చీలికను తెప్పపెట్టారు. మేము మరో పోరాటాన్ని నడపాల్సి వచ్చింది పి.యల్.ఓ., పాలస్తీనా జాతీయ ఐక్యతను సంరక్షించేకే ఆ పోరాటం. లెబనాన్ యొక్క జాతీయ–దేశభక్తి శక్తులలోని మా సహోదరులతో భుజం, భుజం కలిపి దేశం దక్షిణభాగాన అత్యంత క్లిష్టమైన, రక్తసిక్తమైన యుద్ధాన్ని యింకా మేము కొనసాగిస్తున్నాం. ఇజ్రాయిల్ విమానదాడులు, ఇజ్రాయిల్ యుద్ధనౌకలు ప్రయోగించిన తూటాలు, దక్షిణ లెబనాన్‌లోని జాడులు, పాలస్తీనా శరణార్థుల శిబిరాలపై శత్రుసైన్యాలు సాగించే దుష్టచర్యల్లో మేము ఎంతో రక్తాన్ని చిందించాము; ఎన్నో నష్టాలు పొందాము.

ఇజ్రాయిల్ ఆక్రమిత ప్రాంతాల్లోనే తిరుగుబాటు చాలా ప్రాముఖ్యమైన అంశం. మధ్య ఆసియాలో బలమైన శక్తి అయిన ఇజ్రాయిల్ యుద్ధ యంత్రాంగంపై, అమెరికా సామ్రాజ్యవాదంపై జరుగుతున్న ప్రజా ఉద్యమ ప్రవాహంలో మేము మౌలికమైన ప్రజాతంత్ర మార్పును చూస్తున్నాం. ఈ తిరుగుబాటు, ఆవరణతో నిజమైన ప్రజాసామ్రాజ్యం పాల్గొనే పాలస్తీనీయుల విప్లవం. దాదాపు ఒక సంవత్సరంగా యిది సాగుతున్నది. ఈ తిరుగుబాటు ఉధృతంగా సాగేకొలదీ, యీ ప్రజా కార్యాచరణకు మార్గదర్శకంగా వుండేందుకు వీలుగా ప్రతి జాతిలోని సకల సామాజిక తరగతుల, సకల వృత్తులకు చెందిన ప్రతినిధులతో ప్రజా కమిటీలు ఏర్పాటు చేయబడినాయి. గాజాలో 68, ద్జావియాలో 18, నబ్లుస్‌లో 51. రమల్లాహ్‌లో, అల్–బియిరాలో 49 కమిటీలు ఏర్పాటుచేయబడినాయి.

2800 మంది పి. యల్. ఓ. కార్యకర్తలు అరెస్టు చేయబడినప్పుడు—ఈ సంఖ్యను ఆక్రమిత అధికారులే యిచ్చారు—కొత్తవారు వారి స్థానంలో వచ్చారు. ఎక్కడైనా ఒక కమిటీని రద్దుచేస్తే దాని స్థానే మరో కొత్తది పుట్టుకు వచ్చేది.

మేము ప్రజా ఐక్యతను సాధించాము. సమిష్టి జాతీయ సైన్యాన్ని ఏర్పాటు చేశాము. ఇది పి.యల్.ఓ. దాని కార్యవర్గాలయొక్క అంతర్భాగం అయింది. దీనిని ఖొమేనీ అనుకూల శక్తులు రూపొందించాయనీ, ఇరాన్ ప్రోత్సాహంమీదట పాలస్తీనియన్ల చర్చిలు, మసీదులు మతపరమైన సెలవు దినాలను పాటించడంలేదని ఎంతో వూహాగానం చేయబడింది. అయితే అసలు సత్యమేమంటే మా పట్టణ ప్రాంతాల్లోని ప్రజలందరూ తిరుగుబాటు నినాదాలకు మహోత్సాహంతోకూడిన తోడ్పాటును యిచ్చారు. ముస్లిమ్‌లు, క్రైస్తవులు భుజం భుజం కలిపి పోరాడుతున్నారు. క్రైస్తవులుకూడా ఇరాన్‌నుండి ఆదేశాలు పొందారా? పోరాటాన్ని నడిపిస్తున్నది పి.యల్.ఓ. కాదని నిరూపించడానికీ, పి.యల్.ఓ. మధ్య, యితర ప్రజా కార్యాచరణలమధ్య చీలిక తేవడానికి వీలుగా యీ ఆరోపణలు చేస్తున్నారు. తిరుగుబాటుకు నాయకత్వం వహిస్తున్న నిజమైన సంస్థ పి.యల్.ఓ యేననీ, అత్యధిక సంఖ్యాక పాలస్తీనియన్లు దానిని బలపరుస్తున్నారనీ యీనాటికే మా శత్రువులు అంగీకరిస్తున్నారు.

బీరుట్‌లోని మూసివేయబడిన కాందిశీకుల శిబిరాల్లోని తమ సహచర దేశభక్తులకు తోడ్పాటుగా ప్రదర్శనలు జరుపవలసిందిగా ఆక్రమిత ప్రాంతాల్లోని ప్రజలకు మేము పిలుపుయిచ్చిన 1987 అక్టోబరు 24 న యీ సంఘటనలన్నీ జరిగాయి.

అప్పటినుండే తిరుగుబాటు వెల్లువలు ఒకదాని తరువాత ఒకటి జరుగుతున్నాయి; అవి సర్వ సాధారణమైనవైనాయి; ఇవి అత్యంతమైన నిర్మాణ స్థాయినే గాక, నూతన ప్రజాస్వామ్య ధోరణుల పెరుగుదలను కూడా సృష్టికరిస్తున్నాయి.

పి.యల్.ఓ. నాయకత్వం, సర్వ సైన్యాధ్యక్షుడు యింతవరకు తీసుకొన్న అత్యంత కఠినమైన నిర్ణయం యేమంటే, ప్రదర్శనలలో, ఇజ్రాయెల్ దళాలు, సాయుధ యూదు నివాసులతో జరిగే ఘర్షణల్లో ఆయుధాలను ఉపయోగించరాదన్నది. మా ప్రజలు అనేకమంది చనిపోయారు లేదా గాయపడ్డారు. అనేకమంది తమ సోదరులను, సోదరీమణులను, తలిదండ్రులను పోగొట్టుకున్నారు. ఆయుధాలు ప్రయోగించకపోవడం అన్నది చాలా కష్టమైనదైనది. ప్రజా బాహుళ్య నిరసనల క్రమంలో సాయుధ చర్యలను నివారించిన అనంతరం అనేక మాసాలకు ఇజ్రాయెల్ సైనిక ముఠాకు మేము యిలా చెప్పాం। మేము ఆయుధాలు ధరించడం

గానీ లేదా ఉపయోగించడంకానీ చేయలేకపోతున్నామని మీరు ఆలోచించడంలేదా? ఒక్క గత మే లోనే ఇజ్రాయల్ దళాలకు వ్యతిరేకంగా మేము 190 సాయుధ చర్యలను నిర్వహించామని ఇజ్రాయల్ సైనికాధికారులే అంగీకరించారు

అన్ని తరగతుల పాలస్తీనా ప్రజలు యీ తిరుగుబాటులో భాగస్వాము లయ్యారు. వీరు మతఛాందసులుగారు. అంటే అర్థం పి.యల్.ఓ.కు అనుబంధించబడిన మతపరమైన ఉద్యమాలకు అందులో భాగస్వామ్యం లేదనికాదు

ఈ తిరుగుబాటు తన మూడవ దశలోనికి ప్రవేశించింది: మొదటిది సార్వత్రికసమ్మె. రెండవది పట్టణ ప్రాంతాల్లో నిరసన, పాక్షిక శాసనోల్లంఘన, యిప్పుడు ఆక్రమిత అధికారులకు వ్యతిరేకంగా సంపూర్ణ శాసనోల్లంఘన.

ఆక్రమిత ప్రాంతాల్లో పాలస్తీనా ప్రజల తిరుగుబాటుకు ప్రపంచ ప్రజలు అన్నివిధాలా తోడ్పాటును కొనసాగించగలరని మేము ఆశిస్తున్నాం.

మధ్య ఆసియా సంఘర్షణకు సమగ్రమైన పరిష్కారానికి ప్రధానమైన షరతు యేమంటే 1967 లో ఆక్రమించుకొన్న మొత్తం అరబ్ భూభాగాలనుండి ఇజ్రాయల్ దళాలు పూర్తిగా ఉపసంహరించుకోవడం. మా దృష్టిలో యీ సమస్య పరిష్కారానికి ఉత్తమ మార్గం యేమంటే, ఐక్యరాజ్యసమితి భద్రతా సంఘం సభ్యులు, పాలస్తీనా విమోచన సంస్థతోసహా ఆ సమస్యకు సంబంధించిన అన్ని పక్షాలవారి భాగస్వామ్యంలో అంతర్జాతీయ మహాసభను ఏర్పాటుచేయడం.

ఈ సంవత్సరం మాకు మరీ ముఖ్యమైనది. ఎందుచేతనంటే, 1988 సంవత్సరంలోనే మధ్యఆసియా సమస్య పరిష్కారానికి అంతర్జాతీయ మహాసభ ఏర్పాటు ప్రతిపాదన వచ్చింది; మాస్కో శిఖరాగ్రసభ నుండీ యీ భావనకు మరింత విస్తృత తోడ్పాటు లభిస్తున్నది. ఇలాంటి ఏర్పాటుయొక్క స్వరూప స్వభావాలు, పరిశీలనాంశాలపై కొన్ని విభేదాలు ఉన్నప్పటికీ యీ భావనను అన్ని సోషలిస్టు దేశాలు, అరబ్ దేశాలు — మరీ ముఖ్యంగా అల్జీర్స్ అసాధారణ శిఖరాగ్రసభ అనంతరం — బలపరిచాయి. ఇది పాలస్తీనా ప్రయోజనాలు కోరే వారికి ప్రధానమైన రాజకీయ విజయం.

1987 ఏప్రిల్‌లో అల్జీర్స్‌లో జరిగిన పాలస్తీనా జాతీయ సమితి సమావేశం, ఆక్రమిత ప్రాంతాల్లో ప్రజా కార్యాచరణ విస్తృత అవకాశాలు, అంతర్జాతీయ పరిస్థితుల్లో సాధారణమైన సయోధ్య — ఇవి శిఖరాగ్రసభ నిర్మాణాత్మక ఫలితాలకు ఎంతో దోహదం చేశాయి.

మధ్యఆసియా మహాసభ భావనకు అలీన ఉద్యమం, ఆఫ్రికాదేశాలు, ముస్లిమ్‌దేశాలు ఇ.ఒ.సి. దేశాలు, ప్రధమంగా అమెరికా తమ తోడ్పాటును యిచ్చాయి. ఇటీవల జరిగిన తమ టోరంటో సమావేశంలో ఏడు పెద్ద దేశాలు యీ మహాసభ జరపాల్సిన ఆవశ్యకతను గమనించాయి.

ఈ భావనను ఇజ్రాయల్‌లోని ప్రజలు ముఖ్యంగా మాతో మంచి సంబంధా లున్న ప్రజాతంత్ర, ప్రగతిశీలశక్తులు బలపరిచారు. పాలస్తీనా ప్రజల స్వయం నిర్ణయాధికార హక్కును బలపరిచే, మా ప్రజలపై నేరాలను జరిపేవారిని గర్హించే యితర శాంతి సంఘాలతో మేము సంప్రదింపులు ప్రారంభించాం. సైనికాధికారులు సైతం శాంతి భద్రతామండలిని ఏర్పాటుచేశారు. నటీనటులు, కళాకారులు, పాత్రి కేయులు, విశ్వవిద్యాలయ ప్రొఫెసర్లతోసహా 1500 మంది మేధావులు, ఇజ్రా యల్ ప్రభుత్వ విధానాన్ని గర్హిస్తూ, పాలస్తీనా ప్రజల స్వయం నిర్ణయాధికార హక్కును పునరుద్ఘాటిస్తూ ఒక ప్రకటనపై సంతకం చేశారు. ఇది ఇజ్రాయల్ సమాజంలో ఒక నూతనమైన, విలక్షణమైన అంశం. ఒక్క కమ్యూనిస్టులేగాదు అనేక యితర పార్టీల, సంస్థల ప్రజలు మమ్మల్ని బలపరుస్తున్నారు. ఇజ్రా యల్‌లో ఫాసిస్టు మనస్తత్వంగలవారు, ఉన్మాదులు, ఉగ్రవాదులు — కహనే, హరాన్ లాంటివారు — వున్నారు. వీరు మరింత నిర్బంధకాండను సమర్థించడమే గాకుండా, ఆక్రమిత ప్రాంతాల్లో జీవించే 2.25 మిలియన్‌ల మంది పాలస్తీనా ప్రజలను బయటకి పంపించాలని కోరుతున్నారు

పాలస్తీనీయుల సమస్య పూర్వరంగంలో ముఖ్యంగా అంతర్జాతీయ మహాసభ భావనను అందరూ బలపరుస్తున్న యీ నేపథ్యంలో పశ్చిమ దేశాల్లో మానవ హక్కుల గురించి చాలా మాట్లాడుతున్నారు అమెరికా, ఇజ్రాయల్ దేశా ల్లోని యీ వర్గాలు మానవ హక్కుల గురించే అర్హత, హక్కు వున్నదా? మాపైగల సంస్థాగతమైన భీభత్సకాండను జరుపుతున్నది వీరు కాదా? వాషింగ్టన్‌లో మా రాయబార కార్యాలయాన్ని మూసివేసింది వీరుకాదా? ఐక్యరాజ్యసమితిలో పి.యల్.ఓ. దౌత్యకార్యాలయాన్ని మూసివేయడానికి ప్రయత్నిస్తున్నది వీరు కాదా? మా కామ్రేడ్ అబు జిహాద్ హత్యవెనుక వున్నది వీరే. ఏథెన్స్, సైప్రెస్‌లలో ప్రముఖ పి.యల్.ఓ. అధికార్లను చంపాలన్న ప్రయత్నాల వెనుక వున్నది వీరే. ట్యునీషియాలోని పి.యల్.ఓ కేంద్ర కార్యాలయంపై విమాన దాడులు జరిపింది వీరు కాదా? స్వదేశానికి తిరిగి వెళుతున్న పాలస్తీనావారున్న నౌకను ముంచి వేసింది వీరే. మరికొన్ని వాస్తవాలను చూడండి: ప్రదర్శకులను చెదరగొట్ట డానికి ఇజ్రాయల్ సైన్యం రసాయనిక పదార్థాలను ప్రయోగించిన కారణంగా 1600 మందికి గర్భస్రావం అయింది. (ఈ సంఖ్యను అధికారులే అంగీకరించారు; 10 వేలమంది పాలస్తీనియన్లు గాయపడ్డారు; వారిలో 3460 మంది శాశ్వతంగా వికలాంగులు అయ్యారు; వేలమందిని నిర్బంధ శిబిరాల్లో పెట్టారు; 3700 గృహాలను ధ్వంసంచేయడం లేదా నేలమట్టం చేయడం జరిగింది. ఇదంతా తిరుగుబాటు ప్రారంభంఅయిన మొదటి పదిమాసాల్లోనే జరిగింది. జెకొస్లోవేకియాలోని లిడిస్ లాగా డజన్లకొద్దీ పాలస్తీనా గ్రామాలు ధ్వంసం అయినాయి.

యూదు జాత్యహంకార శక్తులు తెచ్చిపెట్టిన సంక్షోభాన్ని మేము ఎదుర్కొం టున్నాం. వీరి వత్తిడి కారణంగానే ఐ.రా.స. లోని పి.యల్.ఓ. కార్యాలయంపై విచక్షణాయుతమైన చర్యలను అమెరికా తీసుకొన్నది. ఈ చర్యలు, అమెరికా ప్రభుత్వానికీ, ఐ రా.స. కు మధ్య జరిగిన ఒప్పందాన్ని ఉల్లంఘించేవే. ఈ ఒప్పందం ప్రకారం, ఆ విదేయ దేశమైన అమెరికా, ఐక్యరాజ్యసమితి సభ్య దేశాలన్నింటియొక్క, ఐ రా.స. జనరల్ అసెంబ్లీ యిచ్చిన ప్రతిపత్తిగల పరిశీల కులయొక్క దౌత్య కార్యాలయాలు మామూలుగా పనిచేయడానికి అవసరమైన పరి స్థితులను కల్పించవలసి వున్నది.

దురాక్రమణదారులు దారుణకాండ జరిపినా, మహిళలను, పిల్లలను చంపినా, గృహాలు ధ్వంసంచేసినా, సామూహికంగా అరెస్టులుచేసినా, చర్చిలు, మసీదులపై దాడులు జరిపినా, ఆర్థిక దిగ్బంధానికి పాలుపడ్డా తిరుగుబాటు కొనసాగుతుంది. చరిత్ర గతిని ఎవ్వరూ ఆపలేరు.

ఇరాన్ — ఇరాక్‌ల మధ్య జరిగిన కాల్పుల విరమణ, భద్రతా సంఘం ఆమోదించిన 598 తీర్మానంక్రింద జరిగే వారి శాంతి చర్చలు నిస్సందేహంగా మా ప్రయోజనాలకు బాసటగా వుంటాయి. ఈ రెండు దేశాలమధ్య విభేదాలు న్యాయ సమ్మతంగా పరిష్కరింపబడితే, యీ ప్రాంతంలో పరిస్థితిపై అనుకూల ప్రభావం కలుగచేస్తుంది. సాధారణంగా అంతర్జాతీయ పరిస్థితి మెరుగువలకు గణనీయంగా తోడ్పడుతుంది.

అమెరికా, ఇజ్రాయల్‌మధ్య వ్యూహాత్మక సహకారాన్ని విస్తృతపరచడం, లెబనాన్‌లో పాలస్తీనీయుల ఉనికిని నిర్మూలించడం, పాలస్తీనా ప్రతిఘటనోద్య మాన్ని చీల్చడం, కొన్ని అరబ్ దేశాలు మాతో సంఘర్షణపడేలా చేయడంతో సహా శత్రువుల కుట్రలు, కుహకాలు ఎన్ని జరుగుతున్నప్పటికీ వాటిని ఎదిరించి యిన్ని సంవత్సరాలుగా పోరాడుతూనే వున్నాము. ఇదంతా మా పోరాటానికి చాలా యిబ్బం దులను కలుగచేస్తున్నది. అయినప్పటికీ విజయం మాదేనన్న విశ్వాసం మాకున్నది.

# ఇరాన్-ఇరాక్ యుద్ధం, ఒక పరిశీలన

-అలీఖవారీ

(కేంద్ర కమిటీ ప్రధాన కార్యదర్శి, ఇరాన్ టుడే పార్టీ)

ఇరాన్, ఇరాక్‌లు 1988 ఆగస్టులో కాల్పుల విరమణ ఒప్పందానికి వచ్చాయి. ప్రత్యక్ష శాంతి సంప్రదింపుల దశలో ప్రవేశించాయి. ఎనిమిది సంవత్సరాలుగా సాగుతున్న రక్తసిక్త యుద్ధం ముగుస్తుందన్న ఆశ చిగురించింది. కాల్పుల విరమణను సాధించడంలో ఐక్యరాజ్యసమితి, వ్యక్తిగతంగా దాని ప్రధాన కార్యదర్శి పెరెజ్ డీక్యుల్లర్ ముఖ్యమైన, నిర్మాణాత్మకమైన పాత్రను నిర్వర్తించారు. ఉభయ పక్షాలను సమాధానపరచడానికి అపారమైన ఓరిమి, రాజకీయ చతురత కావాల్సి వచ్చింది. ఐ రా స. పరిశీలకుల బృందం ఒకటి ఇరాన్-ఇరాక్ సరిహద్దు ప్రాంతాలకు వెళ్ళింది. 1987 జూలై 20 న భద్రతా సంఘం ఆమోదించిన 598 తీర్మానం క్రింద అక్కడ దళాల ఉపసంహరణను పర్యవేక్షించడానికి యీ బృందం వెళ్ళింది

టుడే పార్టీ కేంద్ర కమిటీ ప్రధమ కార్యదర్శి ఈ యుద్ధ కారణాలను సాగిన తీరును యీ క్రింద విశ్లేషించారు. ఎనిమిది సుదీర్ఘ సంవత్సరాలపాటు యీ యుద్ధం జరిగిందో ఆయన వివరించారు. ఈ సంఘర్షణ ప్రస్తుత దశలో తన పార్టీ వైఖరిని ఆయన వివరించారు.

ఇరాన్-ఇరాక్ యుద్ధం, అది సాగిన కాలం, సంభవించిన నష్టాలు, జరిగిన విధ్వంస విషయాలకు సంబంధించిచూస్తే రెండవ ప్రపంచ యుద్ధం తరువాత జరిగిన అధ్వాన్నపు సైనిక సంఘర్షణల్లో ఒకటి. మొత్తం సుమారు 10 లక్షల మంది చనిపోయారు. ఒక్క ఇరాన్‌కు జరిగిన ఆస్తినష్టమే 300-400 బిలియన్ డాలర్లు వుంటుందని అంచనా. ఈ యుద్ధానికి కారణం ఇరాక్‌యేనని మా ఒక్క పార్టీయే గాకుండా అనేక అధికార సంస్థలు పేర్కొంటున్నాయి.

ఖొమేనీ, "తూర్పు కాదు, పశ్చిమం కాదు" అన్న తన నినాదంతో "ఇస్లామ్ విప్లవాన్ని" ఎగుమతి చేయాలని కలలు కన్నాడు. ఇరాక్ మీద యీ ప్రభావం పడుతుందేమోనన్న భయంతో బాగ్దాద్ ప్రభుత్వం ఆందోళన చెందింది. టెహరాన్ కేంద్ర ప్రభుత్వ బలహీనత, ముఖ్యంగా పశ్చిమ సరిహద్దు ప్రాంతాల్లో పరిస్థితి కారణంగా—ఆ సమయంలో కుర్దిస్తాన్ విముక్తి ఉద్యమం సాగుతుండింది. యుద్ధంలో సులభంగా విజయం సాధించవచ్చునని ఇరాక్ ప్రభుత్వం ఆశించింది. ఆ వుద్దేశంతోనే బాగ్దాద్ ఇరాన్ విప్లవానికి బద్ధశతృవులైన వారిని బలపరచడం ప్రారంభించింది. ఇందులో బడా బూర్జువాలు, మాజీ రాజు షా ప్రభుత్వానికి అతని భద్రతా పోలీసులకు చెందినవారున్నారు.

ఇరాన్‌లో షా సామ్రాజ్య పతనం కావడంతో పశ్చిమాసియాలో అమెరికాకు వ్యూహాత్మక విషయాల్లో ఒక భాగస్వామి లేకుండా పోయింది. అందే యీ ప్రాంతంలో వాషింగ్టన్‌కు పెద్ద ఆర్థిక, రాజకీయ నష్టం సంభవించింది. అందువల్ల అమెరికా పగసాధించుకోవాలని ప్రయత్నించింది

అమెరికా సామ్రాజ్యవాదమూ, ఇజ్రాయల్ యూదు జాత్యహంకారమూ రెండూకలిసి యీ రక్తసిక్త యుద్ధాన్ని రెచ్చగొట్టాయి; సాగేట్టు చేశాయి. ఇరాన్, ఇరాక్ ప్రభుత్వాల విధానాలు, లక్ష్యాలనుబట్టి యీ రెండూ అనగా, అమెరికా, ఇజ్రాయిల్‌లు తమ దీర్ఘకాల పథకాలను రూపొందించుకున్నాయి.

సైన్యానికి తన దేశ సరిహద్దులను సంరక్షించుకొనే కర్తవ్యమే గాకుండా "దేవునికోసం పవిత్రం యుద్ధం చేసే, దేవుని శాసనాలను ప్రచారం చేసే కర్తవ్యం కూడా వున్నదని ఇస్లామ్ రిపబ్లిక్ రాజ్యాంగం తెలియజేస్తున్నది. వీరయోధులు యిచ్చే యీ మధ్య యుగాలనాటి నినాదాలను ప్రభుత్వం అధికారులు, మొల్లాలు అధికార ప్రచారకులు లంకించుకొన్నారు. అంటే "ఇస్లామ్ విప్లవం" ఆచరణలో చురుకుగా ఎగుమతి చేయబడడం ప్రారంభం అయిందన్నమాట.

మొదటగా ఇరాక్‌లో తమ పథకాలను అమలుపరచాలని ఖొమేనీ, ఇతర ఇరాన్ నాయకులు ఆశించారు. ఎందుకంటే దాని జనాభాలో ఎక్కువ భాగం షియా మతస్థులు.

శతృచర్యలు ప్రజ్వరిల్లడంతో సామ్రాజ్యవాద వ్యతిరేక, షా వ్యతిరేక విప్లవానికి సంబంధించిన అనేక వైరుధ్యాలు, మనోభావాలు ముందుకు వచ్చాయి. ఇరాన్ ప్రభుత్వానికి ఎంతోకాలంగా ఎదురుచూస్తున్న సాకు దొరికింది. ప్రచార అవకాశం ముమ్మరంగా దొరికింది. దీనితో తన విస్తరణ విధానాన్ని అమలు పరచడం ప్రారంభించేంది. "ఇస్లామ్ విప్లవ రక్షణ", "దైవదూషణ వ్యతిరేక పోరాటం నినాదాలతో మతతత్వ, ప్రాంతీయ మరహంకార ఉన్మాద జ్వాలలను ప్రజ్వలింపచేశారు. తన విస్తరణ వాద సైద్ధాంతిక వైఖరులను ఉద్ధృతం చేసేం దుకు ఖొమేనీ వీటిని సంవత్సరాల తరబడి ఉపయోగించుకొన్నాడు.

విప్లవ ఎగుమతి, ఇస్లామ్ సామ్రాజ్య నిర్మాణం అన్న విధానం, ఇరాక్‌తో యుద్ధం కొనసాగించడం అన్నదానికే పరిమితం కాలేదు. ఇరాన్ ప్రభుత్వం లెబనాన్‌తో సాయుధ జోక్యానికి పాల్పడింది. హెజ్‌బొల్లా (అల్లా పార్టీ) అర్ధ సైనిక బృందాలను అక్కడ నెలకొల్పింది. లెబనాన్ జాతీయ ప్రగతిశీల శక్తుల విముక్తి పోరాటం పట్ల నిర్లక్ష్యాన్ని ప్రదర్శించింది. వారిపై భీభత్సకాండను జరిపింది. మనుష్యులను బలవంతంగా ఎత్తుకపోయింది. దొంగచాటుగా ఆయుధాలు చేరవేయడం వగైరాలకు పాల్పడింది.

టెహరాన్ ప్రభుత్వం, ఆఫ్ఘన్ అభివృద్ధి నిరోధక శక్తులకు సకల సహాయాలు చేసింది. సాయుధ ప్రతీఘాత విప్లవకారులు శిక్షణా శిబిరాలు ఏర్పాటుచేయడంలో సాయపడింది. వారికి ఆయుధాలు, డబ్బు సరఫరా చేసింది. ఆఫ్ఘన్ విప్లవాన్ని గొంతు నులిమివేయడానికి అమెరికా, పాకిస్తాన్, యీ ప్రాంతంలోని యితర అభివృద్ధి నిరోధక ప్రభుత్వాలు అనుసరించిన విధానాన్నే అనుసరించింది. రెండు దేశాల ప్రయోజనాల దృష్ట్యా చూసినా, ఇరాన్-ఇరాక్ యుద్ధం మతిలేని, రక్తసిక్త సాహసం తప్ప యింకొకటి కాదు. ప్రపంచ వ్యాపితంగా వున్న సహృదయ ప్రజలు యింత సుదీర్ఘ కాలం జరిగిన యీయుద్ధాన్ని యిలాగే చూశారు. అయితే దీనిని రెచ్చగొట్టి, ప్రజ్వరిల్ల చేసినవారు, తమ స్వంత లక్ష్యాలకు అనుగుణంగా అగ్నికి ఆజ్యంపోశారు.

షా ప్రభుత్వం పతనం కావడంతో ఈ ప్రాంతంలో అమెరికా సామ్రాజ్యవాదుల పట్టు దెబ్బతిన్నది. తన నయా ప్రపంచ ఆధిపత్య లక్ష్యాలకు మరింతగా నెరవేర్చుకొనడానికి, పర్షియన్ సింధుశాఖలో తన సైనిక ఉనికిని మరింతగా నిర్మించుకొనేందుకు అమెరికా సామ్రాజ్యవాదానికి ఒక సాకు కావాల్సివచ్చింది. వాషింగ్టన్ యొక్క మధ్య ఆసియా వ్యూహంల్లో దీనిని కీలక ప్రాంతంగా అమెరికా సామ్రాజ్యవాదం భావించింది. అమెరికా రక్షణమంత్రి ఫ్రాంక్ కార్లుస్సి యిటీవల చెప్పినట్టుగా అమెరికా యీ ప్రాంతంలో దశాబ్దాలుగా చురుకుగా వుంటున్నది. ఈ ప్రాంతాన్ని విడిచివెళ్ళే అభిప్రాయం కూడాలేదు. ఒకప్రక్క ఇరాన్, ఇరాక్‌ల యుద్ధానికి పురికొల్పుతూనే మరొక ప్రక్క పర్షియన్ సింధుశాఖలో తన బలమైన నౌకాదళాన్ని కేంద్రీకరిస్తూనే వుంది.

ఏ యుద్ధం అయినా ప్రజలకు యిక్కట్లను, దుస్థితినీ తెచ్చిపెడుతుందికదా. మీ ప్రజలు యిబ్బందులకు, విచారాలకు గురిఅయ్యారు. ప్రపంచ ఆరోగ్య సంస్థ (W.H.O) లెక్కల ప్రకారం ప్రపంచంలోని వికలాంగుల్లో ఎక్కువ సంఖ్య ఇరాన్‌లో వున్నారు. వికలాంగులు వుపయోగించే చక్రాల కుర్చీలు, యితర సామాగ్రిని ఉత్పత్తి చేయడం అన్నది ఇరాన్ వాణిజ్యవేత్తలకు లాభదాయకమైనదిగా పరిణమించింది. నిరుద్యోగుల 5 మిలియన్లకు చేరారు; మొత్తం కుటుంబాల్లోని

16 శాతం కుటుంబాలకు జీవన భృతి సంపాయించే వారు ఒక్కరుకూడా లేకుండా పోయారని 1987 జనవరిలో అధికార పత్రికా విభాగాలు తెలియజేశాయి.

జాతీయ ఆర్థిక వ్యవస్థ తీవ్ర సంక్షోభంలో వుంది. ప్రభుత్వం పేర్కొన్న పంథాకు అనుగుణంగా ఫ్యాక్టరీలన్నీ సైనిక ఉత్పత్తి కేంద్రాలుగా మార్చివేయబడి నాయి. షా ఆర్థికవిధానం ఫలితంగా ఇరాన్ పరిశ్రమలు ఎక్కువగా విదేశీ సరఫరాల మీద ఆధారపడింది. ఈ విధానాన్నే ఖోమినీ కొనసాగిస్తున్నాడు. విడిభాగాలు, సగరం తయారుచేసిన వస్తువులు, ముడిపదార్థాలు కావాలి. విదేశీ మారకం ద్వారావే యివి లభిస్తాయి విప్లవం తరువాత సగం పారిశ్రామిక సంస్థలు మూసి వేయబడి నాయి; లేదా సగం ఉత్పత్తి శక్తిలో పనిచేస్తున్నాయి. ఉత్పత్తి మాంద్యం,తక్కువ నూనె ధరల కారణంగా గత కొద్ది సంవత్సరాలలో దేశం ఆదాయం 75 శాతం తగ్గిపోయింది. ఆయిల్ మీదవచ్చే మొత్తం ఆదాయం నల్లబజారులో ఖరీదైన ఆయుధాలు కొనుగోలు చేయడానికే ఉపయోగింపబడిందంటే ఆర్థిక, సామాజిక రంగాల్లో సంక్షోభం ఎంతతీవ్రంగా వున్నదో యిట్టే అర్థంచేసుకోవచ్చు. వందల వేల మంది కార్మికులు బలిపశువులుగా యుద్ధరంగానికి పంపివేయబడ్డారు. విద్యా మంత్రిత్వశాఖ లెక్కల ప్రకారం 1987 లో 120000 మంది తరుణ వయస్కులు పాఠశాలల నుండే విచక్షణా రహితంగా వూచకోతకు గురి అయ్యేందుకు యుద్ధ రంగనికి వెళ్ళారు.

ఇప్పుడు అక్కడ కాల్పుల విరమణ జరిగింది. శాంతి పునరుద్ధరించబడు తుందని ఆశిస్తున్నారు. అయితే జరిగిన నష్టాన్ని పూడ్చుకొనడానికి దశాబ్దాల తరబడి కష్టించి పనిచేయాల్సి వుంటుంది; బిలియన్‌ల డాలర్లు వెచ్చించ వలసి వుంటుంది.

ఏ మాత్రం వెరపు, ఆలోచనా లేకుండానే యుద్ధాన్ని ప్రారంభించాలన్న నిర్ణయం చేశారు అయితే పూర్తిగా సామరస్య సాధనకు సమయం తీసుకుం టుంది. యుద్ధం సాగిన సంవత్సరాల కాలంలో ఉభయ దేశాల మధ్య అనేక జటిల సమస్యలు పేరుకొని పోయాయి. అమెరికా, యితర నాటో దేశాలు, ఇజ్రాయిల్, ఆయుధ బేహారులవంటి తెరవెనుక శక్తులకు,యీ యుద్ధాన్ని సాగించ డంలో కీలకమైన ప్రయోజనం వున్నది. అందువల్లనే శాంతిశక్తులు అప్రమత్తంగా వుండాలి; సంఘర్షణ పరిష్కారానికి ప్రస్తుతం జరుగుతున్న అన్ని ప్రయత్నాలకు దోహదపడాలి

సంవత్సరాలుగా యీ యిరుగు పొరుగు దేశాలమధ్య రాజుకొంటున్న వికృత సంఘర్షణకు గల అసలు కారణాల రేఖాచిత్రం యిదంతా. ప్రారంభం నుండే ఇరాక్ దళాలు ప్రధానంగా దాడిని సాగించాయి. కొంత ఇరాన్ భూభాగాన్ని ఆక్ర మించుకున్నాయి. ఇది, ఆ సమయంలో యుద్ధ స్వభావాన్ని నిర్ణయించింది. ఈ సంఘర్షణకు సంబంధించి మా పార్టీ వైఖరియొక్క ముఖ్యమైన రాజకీయాంశంగా

తయారైంది. మా నిర్ధారణలు, ఎత్తుగడలు సరియైనవని ఆచరణ రుజువుచేసింది. ప్రారంభంలో మేము యిది ఇరాన్ విముక్తి ఉద్యమం అని భావించాము. మా పార్టీ, దేశంలోని యితర ప్రగతిశీల శక్తులు, మాతృదేశాన్ని విప్లవాన్ని సంరక్షించడానికి నడుంకట్టాయి. దురాక్రమణ దారును త్రిప్పికొట్టేందుకు సమర్ధవంతంగా కృషి చేశాయి. ఆనాడు ప్రజలు వీరోచితంగా పోరాడారు; దేశభక్తి భావంతో యుద్ధాన్ని సాగించారు.

అనేకమంది టుడే పార్టీసభ్యులు, ఆఫీసర్లు, వ్యక్తులు యుద్ధరంగంలో వీరోచితంగా పోరాడారు. అయితే దురాక్రమణను తిప్పికొట్టిన తరువాత వారిని అణచివేశారు; కాల్చిచంపారు; యితర పార్టీ సభ్యులతోపాటు సంవత్సరాల తరబడి జైళ్ళలో కుక్కారు.

మాతృదేశరక్షణ అన్నదానితో సాగిన యుద్ధం మొదటివళ రెండు సంవత్సరాలు పాటు జరిగింది. కుర్రంషహర్ విముక్తి అయినప్పుడు, ఇరాక్ సైన్యాలను వెనక్కు నెట్టివేసినపుడు మేము మా నినాదాన్ని ఎత్తుగడలను సవరించుకున్నాము. ఈ నరమేధాన్ని ఆపుచేయాలనీ, సంఘర్షణకు శాంతియుత పరిష్కారాన్ని కనుగొనాలని మేము డిమాండ్ చేశాము. అమెరికా సామ్రాజ్యవాదుల కుట్రలనుంచి విప్లవాన్ని రక్షించాల్సిన ఆవశ్యకతను అప్పటికే గుర్తించి మా పార్టీ విదేశీ భూభాగంపై శత్రుచర్యలు కొనసాగించడం అంటే అమెరికా, యితర అభివృద్ధి నిరోధక శక్తులకు ఉపయోగపడడమేనని స్పష్టంగా అవగాహన చేసుకున్నది. ఈ సంఘర్షణ నూతన స్వభావాన్ని అనగా యితరుల భూభాగాలను గెలవాలన్న, దోపిడీ యుద్ధస్వభావాన్ని సంతరించుకున్నది. ఖోమేనీ పథకాల వల్లనే యిలా జరిగింది.

ఆ సమయంలో, సోవియట్ యూనియన్ శాంతి ప్రతిపాదనలను "గుడ్డిగా అనుసరిస్తున్నదని" మా పార్టీని ఇస్లామ్ అధికారులు నిందించారు. శత్రుచర్యలు కొనసాగడానికి వీలుగా, సామ్రాజ్యవాదం, యూదుతత్వం ప్రయోజనాలకు అనుగుణంగా అప యీ ప్రాంతానికి విస్తరించడానికి వీలుగా అమెరికా చేయవలసినదంతా చేస్తున్నదని మా పార్టీ నిర్ధారణకు వచ్చింది. సాధ్యమైనంత కాలం యీ వికృత పోరాటం కొనసాగాలన్న ధ్యేయంలోనే వాషింగ్టన్ వుంది.

యుద్ధం మరింత ప్రజ్వరిల్లడానికి సర్దా దళారీ బూర్జువా వర్గం కూడా తోడ్పడింది. ఖోమేనీ దురాక్రమణ పథకాలను ప్రోత్సహించింది.

ఇరాక్ నూనె గనులను, క్షేత్రాలను పట్టుకోవాలని టెహరాన్ కలలు కన్నది. తద్వారా అపారమైన లాభాలు తీయాలని భావించింది. అందువల్లనే బూర్జువావర్గం, ఇరాక్ భూభాగంమీద యుద్ధం సాగించేందుకు వీలుగా ప్రభుత్వానికి ఆర్థిక, రాజకీయ మద్దతును యిచ్చింది. అమెరికా సామ్రాజ్యవాద ప్రయోజనాలు, ఖోమేనీ విస్తరణవాద భ్రమలు, బడావ్యాపార బూర్జువావర్గ పథకాలు—యివన్నీ

దేశాన్ని ఒకే దిశగా మళ్ళించాయి: అంటే నిరంతర రక్తపాతంలోనికి నెట్టాయి. మరో ఆరు సంవత్సరాలు శతఘ్నులు గర్జించాయి: అమాయకులు బలైపోయారు. వందలవేలమంది మాతృమూర్తులు తమ పుత్రులను పోగొట్టుకొని అల్లాడిపోయారు మన కాలంలోని అత్యంత విషాదకరమైన, దారుణమైన నాటకంలో చివరి అంకం యీనాడు వ్రాయబడుతున్నది. అదే ఆశ చిగురిస్తున్నది. ఎవరు గెలిచారు లేదా ఎవరు గెలుస్తారు: స్పష్టమైన అంశం ఏమంటే ఇరాన్, ఇరాక్‌ల శత్రువులు యీ యుద్ధంలో గెలుస్తారు. ఈ యుద్ధం రెండు దేశాల మూర్ధులను పీల్చివేసింది. సామ్రాజ్యవాద వ్యతిరేక విప్లవం కొనసాగించినందుకు మా ప్రజలు యీవిధంగా మూల్యం చెల్లించారు.

అమెరికా, ఫ్రెంచ్ యితర గుత్తపెట్టుబడుదారులు, ఇరాన్, ఇరాక్‌లకు యీ ప్రాంతంలోని యితర దేశాలకు ఆయుధాలు అమ్మడంద్వారా విపరీతమైన లాభాలు పొందారు. ఈ దేశాలు ఆయుధాలు కొనుగోలు చేయడానికి అవసరమైన డబ్బు ప్రధానంగా ఆయిల్ నుండి వస్తుంది. ఇది యీ దేశాల ప్రధాన జాతీయ ఆస్తి లేదా వనరు. అందువల్ల యివి ఆయిల్ ఉత్పత్తిని, అంతర్జాతీయ మార్కెట్టులో దాని అమ్మకాన్ని పెంచాయి. ఫలితంగా ఆయిల్ ధరలు తగ్గాయి.

తన స్వంత ప్రజలపైనే ఎక్కుపెట్టబడిన టెహరాన్ దుస్సాహసిక విధానం కారణంగా అమెరికా సైనిక ఉనికి ఎక్కువైంది. పర్షియన్ సింధుశాఖ ప్రాంతంలో ప్రత్యక్ష సాయుధ జోక్యం ప్రమాదం ఏర్పడింది. 1988 ఏప్రిల్‌లో ఇరాన్ ఆయిల్ టెర్మినల్స్, ప్లాట్‌ఫారమ్స్ మీద మిస్సైలీ దాడులు జరిగాయి. పెంటగన్ పెద్దల నేరస్థ పూరిత బాధ్యతారహిత చర్యల ఫలితంగా 298 ప్రయాణీకులున్న ఇరాన్ విమానం కూల్చివేయబడింది. ఈ ఘటన ప్రపంచాన్ని దిగ్భ్రాంతి పరచింది. ఇది సాంకేతిక లోపంవల్ల జరగలేదు; విధానానికి సంబంధించి ఎత్తుగడలలో పొరపాటు అంచనాల కారణంగా జరగలేదు. ఇది అమెరికా అధ్యక్షభవనం ప్రపంచ ఆధిపత్యవాద విధానం తార్కిక ఫలితమే.

మా ప్రజల జాతీయ ప్రయోజనాలపట్ల అమెరికాకు గల బరితెగించిన దురాక్రమణ పూరిత విధానం, ఇరాన్ నాయకత్వంయొక్క పసలేని అమెరికా వ్యతిరేక నినాదాలు, ఖొమేనీ ప్రభుత్వం, అమెరికాలు రెండూ కలసి కుట్రచేయడాన్ని నివారించలేకపోయాయి. ఈ ఇస్లామిక్ రిపబ్లిక్‌కు పెంటగన్ రహస్యంగా ఆయుధాలు సరఫరా చేయడాన్ని ప్రపంచ ప్రజలు మర్చిపోలేరు. ఇదే ఇరాన్ గేటు కుంభకోణం. ఈ కుంభకోణాలు, ఇరాన్ ప్రభుత్వంలోని "మితవాదులతో" సంబంధాలు ఏర్పాటు చేసుకొనడం అన్న వాషింగ్టన్‌యొక్క నిలకడతో కూడిన విధానానికి ప్రతిబింబాలు. ఆయతుల్లా మొంతజేరి (ఖొమేనీ వారసుడు) ప్రతినిధి, ఒక అమెరికా

జనరల్ మధ్య అంకారాలో జరిగిన సమావేశం, ఇరాన్ గేటు ఎత్తుగడ కొనసాగించడాన్ని తెలియజేస్తుంది. టెహరాన్‌కు సరఫరా చేయబడే ఆయుధాలు, మందుగుండు సామాగ్రి ఆఫ్ఘన్ విప్లవ విద్రోహులకు అందజేయబడాలన్న అవగాహన కూడా వుంది.

వాషింగ్టన్‌యొక్క రహస్య, బహిరంగ మద్దతువున్న టర్కీ, పాకిస్తాన్, దక్షిణాఫ్రికాల్లో ప్రజాస్వామ్యం, మానవహక్కులు పూర్తిగా అణచివేయబడుతున్నప్పటికీ తాను ప్రజాస్వామ్యం, మానవహక్కులకు కట్టుబడి వుంటానని అమెరికా బహిరంగంగా చెబుతూనే వున్నది. ఈ ప్రాంతంలోని దేశాలపట్ల అమెరికాకు గల విధానం, యీ పర్షియన్ గల్ఫ్‌దేశాల నుండి అమెరికా గుత్తపెట్టుబడిదారులు తరలించుకవెళ్ళే వందల బిలియన్ డాలర్లమీద ఆధారపడివుంటుంది.

అమెరికా భూభాగానికి 15000 కిలోమీటర్లకు పైగా దూరంగా పర్షియన్ గల్ఫ్‌లో, రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత అతి పెద్ద నౌకాదళాలను కేంద్రీకరించడంలో ఎలాంటి న్యాయంలేదు. 'అమెరికా ప్రయోజనాలను సంరక్షించడం' అన్న లక్షణంతోనే యీ చర్య తీసుకొంటున్నామని పైకి ప్రకటించారు అసలు వాస్తవంగా దీని ఉద్దేశం మా జాతీయ సంపదను కొల్లగొట్టడం.

ఐక్యరాజ్య సమితి భద్రతా సంఘం 598 తీర్మానాన్ని, అది ఆమోదించబడిన దాదాపు సంవత్సరానికి, అనగా యుద్ధరంగంలో అనేక పరాజయాల పాలైన తర్వాత ఇరాన్ ప్రభుత్వం ఆమోదించింది ఇరాన్, తాను అంతకుముందు పట్టుకొన్న పాదీ్వపకల్పాన్ని, మద్‌నుండాదీవిని పోగొట్టుకున్నది. ఈ విషమ పరిస్థితిని అంగీకరిస్తూ ఖొమేనీ యిలా అన్నారు:"ఈనిర్ణయం విషంకంటే ఘోరమైనది. అయితే అల్లా అభీష్టానికి తలవొగ్గుతాను. అయినా నేను దానిని త్రాగుతాను. ప్రతివారికీ ముఖ్యంగా నాకు యీ తీర్మానాన్ని ఆమోదించడం చేదును దిగమింగడంతో సమానం అయితే నేను దీనిని అనగా కాల్పుల విరమణను అంగీకరిస్తున్నాను. జరుగుతున్న ఘటనలు, తెలుస్తున్న వాస్తవాల దృష్ట్యా యిందుకు అంగీకరిస్తున్నాను ప్రస్తుతానికి ఆ కారణాలను నేను వెల్లడించను సీనియర్ రాజకీయ, సైనిక ప్రత్యేక నిపుణుల అభిప్రాయాల దృష్ట్యా కూడా నేను యిలా చేస్తున్నాను. "20 సంవత్సరాలు అయినాసరే పోరాడతాం" అని యీ ఎనిమిది సంవత్సరాలుగా మొండిగా చెబుతున్న అయతుల్లాఖొమేనీ 1988, జులై 18 న దేశప్రజలకు చెప్పిన మాటలు అవి అన్నమాట. ఆయన యింకా యిలా అన్నారు: 'మనది సైద్ధాంతిక యుద్ధం. దీనికి భౌగోళిక స్వరూపంలేదు, దేశాలమధ్య సరిహద్దులు లేవు దీనిని కొనసాగించడానికి ప్రపంచవ్యాపితంగా ఇస్లామ్ సైనికులను మొత్తంగా సమీకరించాలి."

ప్రజల్లో కలిగిన సాధారణ నిరాశ, నిస్పృహలు ఆర్థిక మస్థితి, ప్రధానమైన పరాజయాలు, విపరీతంగా మానవ, ఆస్తి నష్టాలు — ఇవన్నీ కలసి, "ఇస్లామిక్ విప్లవ ఎగుమతిదార్లు," తమ ఎత్తుగడలను మార్పు చేసుకొనేట్టు చేశాయి. మధ్య యుగాలనాటి పిడివాద సిద్ధాంతాలను, నేటి వాస్తవాలకు అనువర్తింపచేస్తే యింతకు మించి వేరే ఫలితాలు ఎలా కలుగుతాయి? విప్లవ సిద్ధాంతాల ఎగుమతికి సంబంధించి యితర ఇస్లామిక్ దేశాలకు 20 వ శతాబ్దం చివరిభాగంలో దండయాత్రలను రెచ్చగొట్టేవారిని యీ క్రింది ప్రశ్నను అడిగే హక్కు వుంది: "విధ్వంసకాండ, పెద్ద నష్టాలు, నియంతృత్వం మన హామీ స్వంత ప్రజలకు మీరేమి యిచ్చారు? మమ్మల్ని ఎక్కడకు తీసుకెడతారు? ఇటీవలివరకు "విజయం సాధించేంతవరకు యుద్ధం" అన్న నినాదం, యీ ప్రభుత్వ మనుగడకు నిస్సంశయమైన ప్రధాని హారరు కారణంగా వుంది.

సైనిక విజయం అన్నది గగన కుసుమం అన్న చైతన్యం ప్రజల్లో వచ్చిన ఫలితంగానే, ఖొమేనీ విధానానికి మార్గాంతరం లేకపోయిందనే ఇరాన్ ప్రభుత్వం 598 తీర్మానాన్ని ఆమోదించింది. (దాని ఫలితంపట్ల తీవ్రమైన అనుమానాలున్నప్పటికీ) యుద్ధం కొనసాగిస్తే పతనం తప్పదని యీ ప్రభుత్వం యిప్పుడు అనుకొంటున్నది.

ఈ సంక్లిష్ట పరిస్థితినుండి బయటపడడం అన్నది ఇరాన్‌కు చాలా కష్టమైన విషయం. ఇస్లామ్ ప్రయోజనాలకే అది యుద్ధాన్ని కొనసాగించింది. ఈనాడు, అదే ప్రయోజనాలకే యుద్ధాన్ని ఆపివేయాలని అనుకొంటున్నది. యుద్ధంచేసి అలసిపోయిన ప్రజలకు యీ తర్కం ఎలాంటి ఉపశమనాన్ని కలిగించదు.

ప్రభుత్వానికి ప్రమాదం కలిగించేంత స్థాయికి ప్రజాగ్రహం చేరుకుంటున్నది. ఖొమేనీ శిబిరంలో విభేదాలు, కుమ్ములాటలు పెరుగుతున్నాయి. అలీ అక్బర్ హషేమీ రఫ్‌సా, జాన్ సాయుధబలగాల ఉపసర్వ సైన్యాధ్యక్షుడుగా నియమింపబడ్డాడు. సాయుధబలగాలను అదుపులో వుంచేందుకే యిలా చేశారు. సైన్యాలను అదుపులో పెట్టడం మరింత కష్టమైపోతున్నది. ప్రభుత్వంలోవున్న సాధారణ సంక్షోభం మరింతగా విషమిస్తున్నది. అధికారుల ఉన్మాదకర నినాదాల, బెదిరింపుల పట్టు సడలిపోతున్నది. సుదీర్ఘకాలం జరిగిన యుద్ధంయొక్క విషాద ఫలితం, దురాక్రమణ, ఇస్లామిక్ విప్లవ ఎగుమతి విధానంయొక్క దివాళాకోరుతనం సాంఘిక — ఆర్థిక దుస్థితి, సకల ప్రజాతంత్ర శక్తుల అణచివేత — ఇవన్నీ ప్రజా వ్యతిరేక, ప్రజాతంత్ర వ్యతిరేక ప్రభుత్వ భవితవ్యాన్ని తిరస్కరించుతున్నాయి.

1988 జనవరిలో జరిగిన మా పార్టీ ప్లీనరీ సమావేశంలో దేశంలోని పరిస్థితిని విశ్లేషించింది. తప్పనిసరిగా జరుగనున్న విధ్వంసంనుండీ, మధ్య యుగాల

పాలనుండి మాతృదేశాన్ని రక్షించడానికి స్వేచ్ఛా, శాంతి విశాల సంఘటనను నిర్మించడం అత్యవసరమని, యిది తక్షణం జరగాలని నిర్ధారణలకు వచ్చింది.

ఈ నేరస్థపూర్వక యుద్ధానికి స్వస్తి జరగాలని ప్రజలు అధికాధికంగా కోరుతున్నారు. అమెరికా, దాని మిత్రదేశాల నౌకాదళాలు పర్షియన్ సింధుశాఖ నుండి తొలగించాలని కోరుతున్నారు. ఈ ప్రాంతంలోని దేశాల వ్యవహారాల్లో జోక్యం కూడదనీ, రాజకీయ ఖైదీలందరినీ విడుదల చేయాలని కోరుతున్నారు.

ఈ సాయుధ సంఘర్షణ, నినాదాల, విజ్ఞప్తుల మేలిముసుగు క్రింద సాగుతున్న ఖొమేనీ విధానం ఇంకా కొన్ని బట్టబయలు చేసింది. ఈ ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాడేందుకు సాధారణ ప్రజాతంత్ర సంఘటన నిర్మాణానికి వస్తునిష్ఠమైన పరిస్థితులున్నాయనీ, అయితే మా జనవరి ప్లీనరీ సమావేశం గమనించినట్టుగా, యీ భావనను అమలుపరచడాన్ని స్వీయాత్మక అంశాలు వెనుక్కు లాగుతున్నాయనీ, యిది విచారకరమని టుదే పార్టీ విశ్వసిస్తున్నది. మున్నెన్నడో సాధించవలసిన శాంతిని స్థాపించేందుకు, యీ నియంతృత్వ పాలనను కూల్చి వేసేందుకు చేతులు కలుపవలసిందిగా దేశంలోని సకల ప్రగతిశీల, ప్రజాతంత్ర శక్తులకు టుదే పార్టీ పిలుపు యిస్తున్నది.

# సాహిత్యం, కళల స్థానం

**వరల్డ్ మార్క్సిస్టు రివ్యూ అడిగిన ప్రశ్నలకు బ్రిటన్, ఫ్రాన్స్, జపాన్‌లకు చెందిన కళాకారులు యిచ్చిన సమాధానాలు.**

శాంతిని పరిరక్షించే, పటిష్ఠీకరించే పాత్ర గురించి వివరించాల్సిందిగా బ్రిటిష్ రచయిత, చలనచిత్ర నిర్మాత పీటర్ ఉస్తినోవ్‌నూ, ఫ్రెంచ్ స్వరకర్త మైకేల్ లెగ్రాండ్‌నూ, జపాన్ రచయిత కెంజాబురో ఓయీని వరల్డ్ మార్క్సిస్టు రివ్యూ కోరింది. వాస్తవానికి ఈనాడు శాంతి సమస్య కున్నంత ప్రాముఖ్యం మరే సమస్యకూ లేదు. వీరికి వరల్డ్ మార్క్సిస్టు రివ్యూ ఈ క్రింది ప్రశ్నలను పంపింది.

1. నేటి ప్రపంచంలో మిమ్మల్ని అన్నిటికంటే ఎక్కువగా కలవర పరుస్తున్న దేమిటి? ఆశావాదానికి తావిస్తున్న దేమిటి?

2. యుద్ధాలులేని ప్రపంచంకోసం సాగే కృషిలో సాహిత్యం, కళల స్థానం యేమిటి? పాత్ర యేమిటి? వాటి వాస్తవ పాత్ర యేమిటి? సంభావ్యపాత్ర యేమిటి? సాంస్కృతిక ప్రముఖునిగా మీ విద్యుక్తధర్మం యేమిటి?

3. అణురహిత, హింసాకాండరహిత ప్రపంచాన్ని నిర్మించడంలో ప్రజలు యెలా సహాయపడగలరని మీరు భావిస్తున్నారు?

ఆ పత్రిక పంపిన యీ ప్రశ్నలకు యీ క్రింది సమాధానాలు లభించాయి.

## పీటర్ ఉస్తినోవ్

*(రచయిత, చలనచిత్ర నిర్మాత, నటుడు)*

1. ప్రజల మధ్య పరస్పర అవగాహననూ, విశ్వాసాన్ని ఎలా స్థాపించడమా అన్నదే నన్ను అన్నిటికంటే ఎక్కువగా కలవరపరుస్తున్న సమస్య. ఎందుచేతనంటే అటువంటి పరస్పర అవగాహననూ, విశ్వాసాన్ని స్థాపించడం నిజానికి భూమండలంపై ప్రాణికోటినీ, నాగరికతనూ పరిరక్షించడంతో సమానం. గతంలోని ఏ ప్రమాదంతోనూ అణుయుగంలోని సైనిక ప్రమాదాన్ని పోల్చజాలము. సైనిక ప్రమాదమే అన్నిటికంటే తీవ్రాతి తీవ్రమైనది. కాబట్టి ఈనాడు అణు బాంబులను

మొదట వుపయోగించే వారిముందు న్యూరంబర్గ్ విచారణలో దోషులుగా నిర్ణయింప బడి ఉరితీయబడిన వారు కేవలం బాలనేరస్తులుగానో, ఆకతాయి కుర్రాళ్ళు లాగానో కనిపిస్తారు. అంతేకాక యీ నైతిక అంశాన్ని రాజకీయాలనుంచి విడదీయ జాలము. నా దృష్టిలో రాజకీయ నియమాలకంటె నైతిక నియమాలకే ఎక్కువ ప్రాముఖ్యం.

ఉన్న సామాజిక - రాజకీయ వ్యవస్థ పట్లనూ, దాని సాంప్రదాయాల పట్లనూ, విలువల పట్లనూ ఈనాడు ఎప్పటికంటె ఎక్కువ సహిష్ణత వ్యక్తం చేయాల్సిన ఆవశ్యకత వుంది. సమస్త మానవ జాతికి చెందిన ఉమ్మడి ప్రయోజనాలకు భంగంకలిగేలా ప్రజలు తమ సొంత ప్రయోజనాలను అత్యుత్సాహంతో సమర్థించుకో ప్రయత్నిస్తే అటు సొంత ప్రయోజనాలకూ ఇటు ఉమ్మడి ప్రయోజనాలకూ భంగంకలిగే ప్రమాదం యేర్పడుతుంది. అంటే చిన్న స్వార్థప్రయోజనం కోసం సమస్తం కోల్పోవలసి వస్తుంది. అయితే అంతమాత్రాన వ్యతిరేకించదగిన ప్రతిదానినీ ప్రశ్నించకుండానే ఆమోదించాలని దీని అర్థంకాదు. విషయాలను ప్రశ్నించి తీరాల్సిందే. నేను నా బిడ్డలకు ఏమైనా బోధిస్తాను. కానీ "నేను చేసినట్లే చేయండ్రా" అని మాత్రం బోధించను. ప్రతిదానినీ ప్రశ్నించండి, ఆలోచించాకనే నిర్ణయాలు తీసుకోండి. మీరు ఏదైనా తప్పు అని భావిస్తే ఆ విషయం నాతో సూటిగా చెప్పేయండి, అప్పుడది చర్చాంశమవుతుంది. నా బిడ్డలకు నేనిలాగే బోధిస్తాను. ఈ మానవ సంసర్గ ప్రాథమిక సూత్రాలు అంతర్జాతీయ సూత్రాలకు కూడా అన్వయింపచేయాలి.

మనం యిప్పటికీ
పట్టులోనే వున్నాం.

ప్రచార సాధనాలు రుద్దాయి. మనం ఈ విధంగా పట్టులో వున్నట్లు మనకే తెలీదు. పెట్టుబడిదారీ విధానాన్ని కానీ సోషలిస్టు విధానాన్ని కానీ డిమాండ్ చేయటం వలదా? శాంతియుత సహజీవనంలో రెండూ ఎందుకుండరాదు? ప్రపంచంలో ఎంతగా భిన్నాభిప్రాయాలుంటే ప్రపంచం అంతగా సంపద్వంతంగా వుంటుందని నేను భావిస్తాను. పెట్టుబడిదారీ విధానం, సోషలిస్టు విధానం మధ్య సైనిక ఘర్షణకు తావుండాల్సిన కారణం నాకు కనిపించడంలేదు. ప్రతి దేశానికి తన అభివృద్ధి మార్గాన్ని ఎంపిక చేసుకునే వుందని భావిస్తున్నా. ఏ సమాజం ఉత్తమమైంది అనే విషయాన్ని బాంబుకంటె జీవితమే బాగా నిరూపిస్తుంది.

నేను ఆశావాదిని; నా ఆశావాదానికి కారణమేమిటో తర్వాత వివరిస్తాను.

2. సాహిత్యం, కళలు మన జీవితాన్నీ, భావాలనీ మరింత బహుముఖమైనవిగా, మరింత సంపద్వంతమైనవిగా రూపొందిస్తాయి. అవి ప్రజలకు పరస్పరం అవగాహన చేసుకోడానికి ఎంతగానో ఉపయోగపడతాయి. మానవ సంబంధాల మధ్య సామరస్యాన్ని సృష్టించడంలో కళాకారులు గొప్ప సేవ

సేవచేశారు: అయినప్పటికీ ఈ విషయంలో చేయవలసింది యింకా యెంతో వుంది. జాతుల మధ్య పరస్పర విశ్వాసాన్ని పెంపొందించడమే రచయిత కర్తవ్యమని నేను ఇసిక్‌కుల్ వేదికలో మరోసారి గమనించాను. అంటే గ్రంథాలు రాయడం ద్వారా మాత్రమే కాక ప్రజలతో సంబంధాలు పెట్టుకోవడంద్వారానూ తమ అభిప్రాయాలను భావాలను మార్పిడి చేసుకోవడం ద్వారానూ రచయితలు తమ కర్తవ్యాన్ని నిర్వర్తించాలి.

3. ప్రపంచ భద్రతను పెంచడానికి ప్రజలు మరింత దయాస్వభావులుగా వ్యవహరించాలి ఈ కర్తవ్యం సాధ్యమైనదనే భావిస్తున్నా. అలా కాకపోతే నేను ఇసిక్‌కుల్ వేదికలో కాని మాస్కోలో జరిగిన "అణ్వస్త్రరహిత ప్రపంచంకోసం, మానవజాతి మనుగడకోసం" వేదికలో కాని పాల్గొని వుండేవాణ్ణికాను. ముఖ్యంగా మాస్కో వేదిక లాటివి మనం మానవజాతి ఉమ్మడి ప్రయోజనాలను మరింత పట్టించుకునేలా చేస్తాయి.

మనకు ఈనాడు కావలసిందేమిటంటే ఇతరులు చెప్పేది వినగలగడమూ ఇతరులకు చెప్పగలగడమూ మనందరికీ ఇవి ముఖ్యం. నేర్చుకునే క్రమం నిజానికి పరస్పరఫలదీకరణతో సమానం. మనం పరస్పరం బాగా అవగాహన చేసుకోవడం ద్వారానూ, పరస్పరం సన్నిహితం కావడం ద్వారానూ మనకు విశ్వాసం పెరుగుతుంది: ప్రజాభిప్రాయం ఒక భౌతిక శక్తిగా రూపొందుతుంది. ఈ మార్గం హింసారహిత ప్రపంచం దిశగా నడిపిస్తుంది. సాహితీవేత్తల, కళాకారుల, శాస్త్రజ్ఞుల అంతర్జాతీయ సమావేశాల్లో ఏర్పడే సంబంధాలు ఎక్కువ ప్రయోజనకరంగా వుంటాయని నేను గమనించాను. అయితే ఈ సమావేశాలనుంచి అద్భుతాలు బయల్దేరతాయని ఆశించలేం. రష్యా ప్రజలు దోసకాయలను, పుట్టగొడుగులను, చిన్న చిన్న చేపలను పెంచడంలో మంచి నిపుణులు. ఏదైనా పదార్థాన్ని కొన్నాళ్లపాటు మూత వేసి తింటే అది చాలా రుచిగా వుండే విషయం మీకు బాగా తెలుసు. సమావేశాల ఫలితాలు కూడా ఇలాగే వుంటాయి. వేదికలు ఆలస్యంగా సృష్టించే ఫలితాలే ఉత్తమ ఫలితాలుగా వుంటాయి. అంటే ఆ ఫలితాలను క్రమేణా రూపొందించాలి. శాంతిని కూడా ఇదే విధంగా క్రమేణా పెంపొందించాలి.

## మైకేల్ లేగ్రాండ్
### స్వరకర్త, గాయకుడు, పియానిస్టు

1. అన్నిటికంటె ఎక్కువ ఆందోళన కలిగించే విషయం ప్రజలు ఒకరినొకరు చంపుకోవడాన్ని చూడడం ఇది అసహజమైనదే అయినప్పటికీ ప్రపంచంలోని పలు ప్రాంతాల్లో ఈ పరస్పర మారణకాండ కొనసాగుతూనే వున్నది.

"స్థానిక ఘర్షణ" అనే నిర్వచనం కొందరిని జోకొట్టవచ్చు కానీ నన్నుమాత్రం జోకొట్టజాలదు. యుద్ధం అంటే ఎల్లప్పుడూ మృత్యువునీ, రక్తపాతాన్నీ, ఎవరో ఒకరు లొంగిపోవడాన్నీ మాత్రమే సూచిస్తుంది.

పీకమీద కత్తిలాగా వున్న అణ్వాయుధాలు మానవజాతికి నిరంతర ప్రమాదం కలిగిస్తున్న భావంతో రాజీపడడం కష్టమే. అణ్వాయుధాల శక్తి సాటిలేనిది. అయితే చీకటిలో కాంతిరేఖలాగా ఆశాభావం కలిగిస్తున్న విషయం యేమిటంటే, ఈ ముప్పునకు సంబంధించిన గ్రహింపు చివరకు ప్రజలు యీ విపత్తుదిశగా వెళ్లడాన్ని ఆపివేయడానికి ప్రోత్సహిస్తుందన్నదే. మనలో ప్రతిఒకరమూ అణుయుగ వాస్తవాలను గ్రహించగానే యీ విపత్తు నివారింపబడుతుందని నేను ఆశిస్తున్నా. ఏదిఏమైనా యుద్ధోన్మాదులు, ఆయుధ పోటీని డబ్బుగా మార్చుకుంటున్నవారు అల్పసంఖ్యాకులేతప్ప అధిక సంఖ్యాకులు కాదు. అయితే అణుయుద్ధాన్ని అనుమతించరాదన్న విషయాన్ని వారు గ్రహిస్తే మంచిది. అణుయుద్ధం జరుగుతూంటే తాము సురక్షితమైన బంకర్లలో కూచుని వుండగలమని వారు ఆశిస్తున్నారా? సైనిక – పారిశ్రామిక సముదాయం అధినేతలు అంతటి అమాయకులని నే ననుకోను.

ఉత్తమ భవిష్యత్తుమీదే నా విశ్వాసం; నా దెప్పుడూ ఆశావాదంతో కూడిన ముందుచూపే. ఇందుకు కారణం నేను విషయాలను రోజారంగు కళ్లద్దాలతో చూడడం కాదు; అసలు కారణం మానవజాతియొక్క నిర్మాణాత్మకమైన శక్తిమీద నాకు అచంచల విశ్వాసం వుండడమే

2. దీనికి మన వృత్తిలో ఎలాటి సంబంధమూలేదు. ఒక స్వరకర్తగా నేను సంగీతంలోనే కాక జీవితంలో కూడా సామరస్యం, సమ్మేళనం కోరుకుంటాను. కళలు, సాహిత్యం ప్రజలను, ప్రపంచాన్ని మరింత ఉత్కృష్టంగా తీర్చిదిద్దుతామన్న దృఢమైన విశ్వాసం నాకుంది. ప్రజల హృదయాలను విజ్ఞాన దీప్తం చేసి, దయను మెచ్చి చెడును నిర్మూలించేది మనంకాకపోతే మరెవరు?

3. ఘర్షణలు లేకుండా శాంతియుతంగా పరిష్కరింపబడని అంతర్జాతీయ సమస్య లేనేలేదన్నది నా విశ్వాసం. ఇది నా దృఢమైన వ్యక్తిగత విశ్వాసం. మానవజాతి ఎలాటి వివాదగ్రస్త సమస్యనైనా చేపట్టి పరిష్కరించగలదు. న్యాయమైన పరిష్కారం కుదరాలంటే, అపోహతో కూడిన భావాలను, మూస పోసిన పాత భావాలనూ, శత్రుత్వ భావాన్నీ విడనాడడం అవసరం. నా కిష్టమైన అపోహ ఒకేఒకటి వున్నది – ప్రజలూ, జాతులూ పరస్పరం స్నేహంగా వ్యవహరించడమే అది. అయితే ఇది ఇంతవరకు కేవలం ఆశగానే మిగిలిపోయింది తప్ప మానవ సంబంధాల సార్వత్రిక నియమంగా మారడం జరగలేదు. కానీ మనం గనక సంయుక్తంగా కృషిచేస్తేమాత్రం ఆ సార్వత్రిక నియమం రేపు అమలులోకి రాగలదు. అందుకు ప్రతి ఒకరూ కృషి చేయగలరు, చేయాలి.

నిజమే. ప్రపంచమంతా వైరుధ్యాల భరితమే. అయితే అంతమాత్రాన జనాలు పరస్పర మారణకాండలో పాల్గొనాలని కాదు. ఆయుధాలు చేపట్టి "శత్రువు"ను గాయపరచడంకంటె మనం అంతా ఒకచోటకూడి ఏ చర్యలు తీసుకోవాలన్న విషయమై చిత్తశుద్ధితో ఆలోచించాలి. మనం మన లోపల దాన్నేకాక మనకు బాహ్యంగావున్న దానిని కూడా గమనించి మన యుగం యొక్క వాస్తవాలను గ్రహించాలి.

కెంజాబురో ఓయే
(రచయిత)

1) ఎక్కువమంది ప్రజలలాగే నేను అణువిపత్తు ప్రమాదావకాశం గురించి కలవరపడుతున్నాను. నేను పౌరునిగానూ, మనిషిగానూ ఆ విషయం గురించి తీవ్రంగా కలత పడుతున్నాను. దిక్కుమాలినన్ని అణ్వాయుధాల నిల్వలున్నాయి: కాగా లిటిల్‌బాయ్ మాత్రం వేలాదిమందిని చంపగలదు. (హిరోషిమాపై బాంబు పడవేసిన విమానాన్ని అమెరికన్లు ముద్దుగా "లిటిల్‌బాయ్" (చిన్నిగాడు) అని పిల్చుకున్నారు)

మీకు సత్యం చెప్పాలి; భవిష్యత్తుపట్ల నేను పూర్తి నిరాశావాదిని. ముఖ్యమైన విషయం యేమిటంటే, ఎవరూ ఆత్మవంచన చేసుకోరాదు, మరొకరిపై ఆధారపడరాదు; జీవితం ఆటుపోట్లలో పడి కొట్టుకుపోరాదు. అజ్ఞానంలో ఆనందంపొందే తత్వం కాదనాది; నేను విధివాదిని కూడా కాదు. పరిణామాలను మంచికోసం మలచాలని మలచబడగలవని నేను విశ్వసిస్తా.

2) ప్రపంచాన్ని మెరుగుపరచడంలోనూ, ఉత్కృష్ట బహుమతి అయిన ప్రాణాన్ని రక్షించడంలోనూ సాహిత్యం, కళలు నిర్ణయాత్మక పాత్ర నిర్వహిస్తాయి. రచనలు, కళాత్మక రూపాలు చాలా బలమైన పరికరాలు. ఇక రచనల విషయానికివస్తే, నేను గత పాతికేళ్ళుగా హిరోషిమా గురించి రచిస్తున్నాను. హిరోషిమా నోట్స్ అనే నా గ్రంథం హిరోషిమా అణుయుద్ధంలో బతికిన వారి గురించి వివరిస్తుంది. (ఈ గ్రంథం 1963 లో ప్రచురింపబడింది) నేను ఆ రచన ప్రారంభించినపుడు ప్రజల మధ్యగల సంఘీభావం గురించి రాయాలనుకున్నాను. చెడుని వ్యతిరేకించడంలో మనమంతా ఐక్యం కావాలి. నేను ఈనాటికీ యీ తక్షణ సమస్య పట్ల విధేయుడిగానే వుంటున్నా.

3) ప్రపంచ భద్రతను పెంచే విషయంలో ప్రజల పాత్ర బహుముఖమైనది. నా స్వానుభవం నుంచి నేనొక విషయం చెప్పగలను; గ్రంథాలు, ప్రదర్శనలు, ప్రగతిశీల యుద్ధ వ్యతిరేక శక్తుల అంతర్జాతీయ వేదికలు ఇలా ఎన్నో గొప్పగా సహాయపడగలవు.

మరో ముఖ్యమైన విషయం ఒకటుంది—ఏదైనా విషయం సవ్యంగా జరక్కపోయినప్పటికీ నిరాశా నిస్పృహలకు గురికాకూడదు. నేను గ్రంథాలు రాయడంతోపాటు మా దేశంలోని యువతీయువకులతో సన్నిహితంగా వుంటాను. అణుయుగంలోని వాస్తవాల స్వరూపాన్ని వారికి వివరిస్తుంటాను. నాకొకందుకు సంతోషంగా వుంది. అణ్వాయుధాగారాలను సహించలేని ఒక నూతన స్థితిని నేటి యువత క్రమేణా సృష్టిస్తున్నది; అలాగే మా ప్రభుత్వం అవలంబిస్తున్న అమెరికా అనుకూల సైనిక విధానాన్ని కూడా మా యువత సహించజాలదు.

వాస్తవానికి మా దేశంలోని యువతీ యువకులు 'హిబకూషి' పోరాటాన్ని చేపడుతున్నారు. జపాన్ చుట్టుపక్కలేకాక ప్రపంచమంతటాగల అణ్వాయుధాగారాలను నిర్మూలించాలని 'హిబకూషి' ఉద్యమకారులు డిమాండ్ చేస్తారు. వారు జపాన్ ప్రభుత్వాన్ని కూడా ఇదే విధంగా డిమాండ్ చేస్తున్నారు కానీ మా దేశంలోని సనాతనవాద ప్రభుత్వం వారి డిమాండ్‌ను పెడచెవిని పెడుతున్నది. అయితే నైతిక విషయానికొస్తే, ఈ ఉద్యమకారులు ప్రజాభిప్రాయాన్ని బలంగా ప్రభావితం చేస్తున్నారు. అది సహజమేమరి హిబకూషి ఉద్యమం అణువిపత్తిని వ్యతిరేకించే సజీవ నిరసన. కాగా పోనుపోను హిరోషిమా నాగసాకి విషాద ఘటనల్లో బతికినవారు చాలా కొద్దిమందే మిగిలివుంటారు. యుద్ధాలను నిరసించడమూ, యుద్ధశక్తులను తలపడే శక్తులను ప్రతిఘటించడమూ మన అంతరాత్మల విధి

అతి ముఖ్యమైన విషయం యేమిటంటే—అణుయుద్ధ ప్రమాదం నిజానికి భౌగోళిక సమస్య; దాని పరిష్కృతిని జాతీయ సరిహద్దులు కుదించజాలవు. ఇందుకోసం పరస్పరకృషి, సన్నిహితమైన అంతర్జాతీయ సహకారమూ అవసరమవుతాయి. ఇందుకోసం మేమేమి చేస్తామూ అని మీరు ఆశ్చర్యపోతూండవచ్చు. మేము అంతర్జాతీయ సమావేశాల్లో పాల్గొంటాం; విదేశాలకు శాంతి ప్రదర్శనలను నిర్వహిస్తాం ఉదాహరణకు, మేము హిరోషిమా దినం పాటించడానికి అమెరికా వెళ్లాం. హిరోషిమా విషాదం పునరావృతం కాకుండా వుండేందుకు హిరోషిమా గంటలు ప్రపంచమంతటా మోగాలి.

# సుప్రసిద్ధ చైనా విప్లవకారుడు
# చౌఎన్‌లై

(చౌఎన్‌లై గురించిన వ్యాస సంకలనం)

---

**సంకలన కర్త : లియూయాన్, మిజెంగ్‌వో**

*1987 లో ప్రచురణ (చైనా భాషలో)*

పుటలు : *585*

గత వసంత ఋతువుకు ఆయనకు 90 ఏళ్లు నిండి వుండేవి. సుప్రసిద్ధ విప్లవ కారుడూ, చైనా కమ్యూనిస్టు పార్టీ వ్యవస్థాపకుల్లో ఒకరూ, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో ప్రముఖ నాయకుడూ, సైనిక నాయకుడూ, దౌత్యవేత్త అయిన చౌఎన్‌లై 1976 జనవరిలో మరణించేదాకా చైనా ప్రజారిపబ్లిక్ ప్రభుత్వాధినేతగా వ్యవహరించాడు.

ప్రజలు ఆయన స్మృతిని ఎంతో ప్రాణప్రదమైనదిగా భావిస్తారు. పెకింగ్ (బీజింగ్)లోని తియనాన్‌మెన్ చౌకులో ఆయన మసోలియం వద్ద చౌఎన్‌లై స్మారక భవనం వుంది. అలాగే తియూనాజిన్, జియాన్, నాంజింగ్ వుహాన్, చాంగ్‌కింగ్, షాంగైలలో చౌఎన్‌లై స్మారక మ్యూజియమ్ లున్నాయి. ఆయన రచనలను ఎంపిక చేసి రెండు సంపుటాలుగా ముద్రించారు; ఆయన సమకాలికులు ఆయన్ను గురించి రచించిన పలువ్యాసాలను గ్రంథస్థం చేశారు ఆయన జీవితం గురించి కూడా పలు గ్రంథాలు ప్రచురింపబడ్డాయి. తియాన్జిన్‌లోని నాంకాయ్ విశ్వవిద్యాలయంలో ఓ ప్రత్యేక అధ్యయన కేంద్రాన్ని యేర్పాటు చేశారు. తియాన్జిన్‌లోనే చౌఎన్‌లై విప్లవ పోరాటక్రమానికి శ్రీకారం చుట్టాడు. ఈ అధ్యయన కేంద్రం ఆయనకు సంబంధించిన లిఖిత పత్రాలను సేకరించి, విశ్లేషించి ప్రచురిస్తుంది.

ప్రస్తుతం ఇక్కడ సమీక్షింపబడుతున్న యీ గ్రంథాన్ని ఆ అధ్యయన కేంద్రమే ప్రచురించింది. ఇందులో 40 వ్యాసాలున్నాయి. చౌఎన్‌లై మరణానం

తరం ప్రచురింపబడిన 700 వ్యాసాలను. లఘు వ్యాసాలను సేకరించి అందులో నుంచి 40 వ్యాసాలు మాత్రమే ఎంపిక చేశారు. ఈ వ్యాసాల రచయితల్లో ప్రముఖ చరిత్రకారులు. చౌఎన్‌లై సహయోధులు, ప్రభుత్వంలో పార్టీలో ఆయనతోపాటు పనిచేసినవారు మొదలైన వారున్నారు. 262 వ్యాసాలకు సంబంధించిన సూచికను ఇందులో చేర్చారు. ఈ సూచిక పరిశోధకులకు ఎంతగానో ఉపయోగపడుతుంది.

వీటిని కాలక్రమానుగతంగా వర్గీకరించి ఏర్పాటు చేశారు. ఇవి చౌఎన్‌లై జీవితానికి సంబంధించినవే అయినప్పటికీ ఇవి యాభైయేళ్ళ చైనా చరిత్రకు అద్దం పడతాయి. ఆ యాభైయేళ్ల కాలంలో ఆయన అనేక ఘటనల్లో క్రమాల్లో చురుగ్గా పాల్గొన్నారు. ఈ వ్యాసాలు ప్రత్యేక చరిత్రకారులకు ఎంత ఆసక్తికరంగా వుంటాయో మామూలు పాఠకులకూ అంతే ఆసక్తికరంగా వుంటాయి.

దేశవాళీ భూస్వామ్య, సైనికవాదుల విదేశీ సామ్రాజ్యవాద ప్రగతి నిరోధకుల పీడననుంచి మాతృభూమిని విముక్తం చేసుకోడానికి విప్లవకర ప్రజాతంత్రవాదిగా పోరాటం ప్రారంభించిన దేశ భక్తుని సంపూర్ణ రూపచిత్రాన్ని ఈ గ్రంథం సృష్టిస్తున్నది. ఆ తరువాత ఆయన మార్క్సిజం–లెనినిజం అధ్యయనంచేసి ఆ సిద్ధాంతాన్ని ఆమోదించి చైనా కమ్యూనిస్టు పార్టీ వ్యవస్థాపకుల్లో ఒకరుగా రూపొందారు. చౌఎన్‌లై యొక్క సైద్ధాంతిక, ఆచరణాత్మక కార్యకలాపాలనూ, ప్రజా విముక్తిసేన నిర్మాణంలో ఆయన చేసిన కృషిని దేశంలోని ప్రజాతంత్ర, దేశభక్త శక్తులతో ఐక్యసంఘటనను నిర్మించి పటిష్టపరచడంలో ఆయన అందజేసిన దోహదాన్ని ప్రజాతంత్ర విప్లవ విజయంలోనూ నూతన, సోషలిస్టు చైనా నిర్మాణంలోనూ ఆయన చేసిన కృషినీ కూడా ఈ గ్రంథం స్థూలంగా వివరిస్తుంది.

చైనా ప్రధానిగానూ, విదేశాంగ మంత్రిగానూ చౌ ఎన్‌లై చేసిన బహుముఖ కృషి గురించీ, శాస్త్రీయ, సాంకేతిక మేధావుల పట్లనూ కళాకారుల పట్లనూ ఆయన వ్యక్తం చేసిన శ్రద్ధగురించీ సాంస్కృతిక రంగంలో అతివాద దోరణులకు వ్యతిరేకంగా ఆయన చేసిన పోరాటం గురించీ ఈ గ్రంథం అద్దం పడుతున్నది.

ఆయన జీవితంలోని అంతిమ దశను వివరించే వ్యాసంతో ఈ గ్రంథం ముగుస్తుంది. 1966 - 76 నాటి "సాంస్కృతిక విప్లవం" తీసుకొచ్చిన "అల్లకల్లోల దశాబ్దం" యాయన జీవితంలో చివరి దశ. ఆ "అల్లకల్లోల దశాబ్దం"లో పలువురు పార్టీ ప్రముఖులు, ప్రభుత్వనేతలు, సైనిక నాయకులు, మేధావులు ఆనాడు "సాంస్కృతిక విప్లవం" ఏజెంట్లయిన వారి అత్యాచారాలకు, భయోత్పాత చర్యలకు గురియ్యారు " ఆ మూకలు చౌ ఎన్‌లైని పలుసార్లు చుట్టుముట్టి నిందించాయి: ఆ మూకల నాయకులు ఆయన్ను రాజకీయ జీవితం నుంచి బహిష్కరించాలని కూడా పథకాలు వేశాయి. ఏది ఏమైనా "సాంస్కృతిక విప్లవం" మూలంగా సంభవించిన నష్టాన్ని చాలామేరకు తగ్గించడానికి. నాయకత్వ స్థానాల్లోని కేడర్లను కాపాడు

కోడానికి మేధావులను రక్షించడానికీ చౌ ఎన్‌లై శక్తివంచనలేకుండా కృషి చేశారు.

"సాంస్కృతిక విప్లవం సందర్భంగా కమ్యూనిస్టుపార్టీ, మొత్తం దేశమూ అరుదైన గడ్డు స్థితిలో పడ్డప్పుడు, ఉద్రిక్త పరిస్థితికి లోనైనప్పుడు పరోక్షంగానే అయినప్పటికి "అతివాద" గ్రూపునకు వ్యతిరేకంగా చౌ ఎన్‌లై తన పోరాటాన్ని కొనసాగించారని 'ముందు మాట'లో స్పష్టంగా వివరించారు. ఆ సమయంలో చైనాలో కానీ విదేశాల్లోకానీ యీ విషయాన్ని అందరూ అర్థం చేసుకోలేదు. అయితే ఆయన్ను గౌరవించడం మాత్రం ఎప్పటిలాగే కొనసాగించారు. గత పదేళ్ళ కాలంలో అంతకుముందు అజ్ఞాతంగావున్న అనేక వాస్తవాలు వెలుగులోకి వచ్చాయి చౌ ఎన్‌లై ప్రసంగాలు ప్రచురింపబడ్డాయి "సాంస్కృతిక విప్లవం" సందర్భంగా ఆయన కృషిని గమనించినవారు స్మృతులు ప్రచురింబడ్డాయి కాబట్టి యీ ప్రముఖ చైనా కమ్యూనిస్టు నాయకుని జీవితంలోని అంతిమదశకు సంబంధించిన వాస్తవ చిత్రాన్ని అందివ్వటం సాధ్యపడుతున్నది.

చౌ ఎన్‌లై గొప్ప శ్రామికవర్గ విప్లవకారుడు, రాజకీయ నాయకుడు, రాజనీతిజ్ఞుడు మాత్రమేకాదు ఆయన ప్రముఖ మార్క్సిస్టు సిద్ధాంతవేత్త, అంటే చైనా వాస్తవాలకు మార్క్సిజం యొక్క సాధారణ సత్యాన్ని అన్వయించడంలో గొప్ప కృషి చేసిన ప్రముఖుడు అని వ్యాస సంకలన కర్తలు నొక్కిచెప్పడం ఎంతైనా సబబే చౌ ఎన్‌లై గ్రంథాలు చైనా విప్లవ ప్రత్యేకతలను, విప్లవ లక్ష్యాలను, ప్రేరక శక్తులను, సాయుధపోరాట లక్ష్యాలను, ప్రజాతంత్ర, దేశభక్త శక్తుల ఐక్య సంఘటన విధానాన్ని స్పష్టంగా వివరిస్తాయి. వివిధ మార్క్సిస్టు వ్యతిరేక పంథాలకు, పార్టీలోని పొరపాట్లకు వ్యతిరేకంగా చౌ ఎన్‌లై నిర్విరామంగా పోరాడాడు; జాతీయ, విదేశాంగ విధానాన్ని రూపొందించడంలో తనదైన అమూల్యదోహదాన్ని అందచేశాడు. నేను ఇంతకు మునుపే చెప్పినట్లు ఇందులోని వ్యాసాలు చౌ ఎన్‌లై జీవితంలోని అనేక దశల గురించి వివిధకార్యకలాపాల గురించీ వివరిస్తాయి. అయితే విచారించాల్సిన విషయం యేమిటంటే 1928 లో మాస్కో నగరంలో జరిగిన చైనా కమ్యూనిస్టుపార్టీ ఆరవ మహాసభలో ఆయన పాల్గొన్న వివరాలను తెలిపే వ్యాసమేదీ యిందులో లేదు. అలాగే కొమింటార్న్ ఆరవ మహాసభలో ఆయన పాల్గొన్న విషయం గురించి కానీ ఆయన ఆ సందర్భంగా కొమింటార్న్ కార్యవర్గ కమిటీ ప్రత్యామ్నాయ సభ్యుడిగా ఎన్నికయిన విషయం గురించికానీ తెలియచేసే వ్యాసమేదీ యిందులో లేదు.

(—పెర్గీ తిక్విన్‌స్కి)

# విమోచన మతవాదం-మార్క్సిస్టు భావాలు

స్టెపన్ మషుంటోవ్
(వరల్డ్ మార్క్సిస్టు రివ్యూ సంపాదకవర్గ సభ్యుడు)

"విమోచనా మతవాదాన్ని, లేక విమోచనా మత సంస్థను నేను ఈ విధంగా నిర్వచిస్తాను. క్రైస్తవ మతం తన పునాదులలోకి తిరిగివెళ్ళి అందులోని అత్యంత ఆకర్షణాత్మకమూ, సౌందర్య పూరితమూ, ప్రతిభావంతమూ ఐన చరిత్రతో పునః సమ్మేళనం పొందటమే అంటారు. కనుక ఈ పరిణామాన్ని దక్షిణ అమెరికాలోని వామపక్ష శక్తులన్నీ పరిగణనలోకి తీసుకోవాలి. ఇటీవలి కాలంలో జరిగిన, జరుగుతున్న మౌలిక పరిణామంగా దీనిని గుర్తించాలి"

ఫైడెల్ కాస్ట్రో

ఈ శతాబ్దం ఆఖరుకల్లా ఒక కొత్త సమస్య తల ఎత్తుతున్నది. సామాజిక శాస్త్రజ్ఞులు దీనిని పరిష్కరించవలసి ఉంది. శాస్త్ర, సాంకేతిక విప్లవ పురోగతి నేపధ్యంలో, సామాజిక మార్పుపట్ల గల ఆకాంక్ష కారణంగా, తాత్విక భౌతిక వాదం గణనీయమైన విజయాలు సాధిస్తున్నది. అదే సమయంలో మత చైతన్యం, ముఖ్యంగా వెనుకబడిన, బడుగు దేశాలలో, చెప్పుకోదగిన రీతిలో పెరుగుతున్నది. దక్షిణ అమెరికా, తూర్పు అరబ్ దేశాలలో మత విశ్వాసాలుగల ప్రజలు, మత పరమైన నినాదాలతో పెద్ద సంఖ్యలో రాజకీయ ఉద్యమాలలో పాల్గొంటున్నారు. అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలలో భిన్నమైన శాఖలు, మత పీఠాలు రూపొందుతున్నాయి. కొన్ని సోషలిస్టు దేశాలలో, మత ప్రచారకుల పాత్ర కొనసాగుతున్నది, పైగా పెరుగుతున్నది. ఈ దేశాలలో కొన్నిచోట్ల మతశక్తులు అధికారులతో సహకరిస్తున్నాయి. మరికొన్ని దేశాలలో, తమ వ్యతిరేక పాత్రను కొనసాగిస్తూనే ఉన్నాయి.

ఇది చాలా విస్తృత పరిణామం. ఇందుకుగల కారణాలను సూత్రప్రాయంగా మాత్రమే ఊహించగలము. చర్చి తన కార్యకలాపాలను విస్తృతం చేస్తూ

బూర్జువావర్గాలు మత మౌఢ్యం వైపు మొగ్గటం ఒక కారణం. బలమైన మరికొన్ని కారణాలు ఉన్నాయి. శాస్త్ర సాంకేతిక విప్లవం నిటారుగా, ప్రమాదకరమైన రీతిలో పెరుగుతున్నది. ప్రకృతి వాతావరణం ధ్వంసమౌతున్నది. యంత్ర నాగరికతలోని మానవతా రాహిత్య ధోరణి, ఫలసిద్ధివాదాలతో ప్రజలు విసుగెత్తిపోతున్నారు. యుద్ధాల బీభత్సం భయంకరంగా ఉంది. అన్నిటికంటె మించి అణుయుద్ధ ప్రమాదం మన నెత్తిన వేలాడుతున్నది బైబిల్ చెప్పిన, 'ప్రపంచ ప్రళయం' మాటను ఇది జ్ఞాపకం చేస్తున్నది. దానితోపాటు వేర్వేరు ప్రాంతాలలో మత కార్య కలాపాలు పెరగటానికి, స్థానిక. ప్రాంతీయ కారణాలు కూడా ఉన్నాయి. లెనిన్ ఒక సందర్భంలో ఇలా అన్నాడు : "అన్ని దేశాలలో, అభివృద్ధిలో ఒక దశలో, రాజకీయ అసంతృప్తి మత రూపంలో వ్యక్తం కావటం సహజం" ఈ అసంతృప్తి మితవాద ధోరణి నుండి కావచ్చు, విప్లవ దృష్టినుండి కావచ్చు. ఇస్లాం మత మౌలిక ఉద్యమాలకు గలకారణాలు, పాత్ర, లక్ష్యాలు, వేరు దక్షిణ అమెరికాలో, క్రైస్తవ మతం, ముఖ్యంగా కాథలిక్ మత పునరుద్ధరణ వాదానికి గల కారణాలు, పాత్ర, లక్ష్యాలువేరు.

ఈ శతాబ్దం మధ్యలో, ఖచ్చితంగా చెప్పాలంటే, క్యూబా విప్లవం జయప్రద మైన పిమ్మట, దక్షిణ అమెరికా కాథలిక్ ప్రపంచంలో ఒక సంచలనం మొద లైంది. ప్రపంచంలోని కాథలిక్ మతస్తులలో సగంమంది దక్షిణ అమెరికాలోనే ఉన్నారు. మతమౌఢ్యం ఎదురుదాడి సాగించింది 1962—65 మధ్య జరిగిన వాటికన్ కౌన్సిల్ (పోప్ ఆధ్వర్యాన జరిగే సభ) వీరికి శిరోధార్యం. ఈ ధోరణికి పోటీగా ప్రజాపునాది గలిగిన క్రైస్తవ మతధోరణి ఒకటి ఆవిర్భవించింది. ప్రాచీన క్రైస్తవ మతంలోని ఉత్తమ లక్ష్యాలను వీరు పునరుద్ధరించారు. దానిసత్యానికి వ్యతిరేకంగా ప్రాణాలర్పించిన క్రైస్తవ మతవీరులు వీరికి ఆదర్శం. నూతన 'చర్చి' నూతన 'మతధోరణి' అని వీరిని పిలవసాగారు.

ఈ ఉద్యమం దక్షిణ అమెరికాలో తలఎత్తడానికి ఏకైక కారణం, ధనిక దరిద్ర సామాజిక వ్యత్యాసాలు ప్రపంచంలో వేరెక్కడా లేనంత హెచ్చుగా ఈ ఖండంలో ఉండటమే.

దక్షిణ అమెరికా కాథలిక్ మతసంస్థలు 1968, 1979 సంవత్సరాలలో రెండు సమావేశాలు జరిపాయి. పేద క్రైస్తవుల వాంఛలను ప్రతిబింబిస్తూ ఈ సమావేశాలు కొన్ని తీర్మానాలు చేశాయి. కాథలిక్ మతంలో ఇదొక 'పెరిస్త్రోయికా' లాంటిది.

ఈ తీర్మానసారాన్ని రోంలోని ఉన్నత మతాధికారులు బలహీనపరచి మభ్య పరచడానికి ప్రయత్నం చేశారు.

పెట్టుబడిదారీ వ్యవస్థలో తీవ్రమౌతున్న వైరుధ్యాలకు చిహ్నాలే లాటిన్ అమెరికన్ కాథలిక్కులలో ప్రారంభమైన ఈ చైతన్యం.

## ఈ ధోరణికి మూలం

కాథలిక్ ప్రపంచంలో చాలాకాలంగా భిన్నధోరణులు తలఎత్తుతున్నాయి. శ్రమజీవులకు. ధనికులకు వైరుధ్యాలు ఏర్పడటం గొప్ప అవమానకరమైన దుర్ఘటన అని పోప్ పయస్ XI బహిరంగంగా ప్రకటించాడు. ఐనా ఈ ధోరణిని అతను నివారించజాలడు'. 'లౌకిక వాస్తవాల మతవాదం' చారిత్రక మతవాదం' 'రాజకీయ మతవాదం', 'విప్లవ మతవాదం' అంటూ అనేక ఉపశాఖలు ఏర్పడ్డాయి. వీటన్నిటిలోకి శక్తివంతమైనది 'విమోచన మతవాదం.'

1964 మార్చిలో బ్రెజిల్‌లోని, పెట్రోపోలిస్‌లో ఒక మత సమావేశం జరిగింది. పెరూకు చెందిన మతాచార్యుడు గునెవో గుటిరైజ్ అందులో ఒక పత్రం ప్రవేశపెట్టాడు. మొదటిసారిగా 'విమోచన మతవాదం' అనేమాట వాడాడు. 1971 లో అదే పేరుతో ఒక గ్రంథం ప్రచురించాడు. రెండు దశాబ్దాలకల్లా ఈ భావాలు మూడో ప్రపంచంలోని వివిధ దేశాలకు వ్యాపించాయి.

ఆఫ్రికాలో జైరీ, టాంజానియా, ఘనా, దక్షిణాఫ్రికాలలో ఈ ఉద్యమం వేరూనింది. దక్షిణాఫ్రికాలో 'నీగ్రో విమోచన మతవాదం'తో ఇది లీనమైపోయింది. ఇండియా, పాకిస్తాన్, శ్రీలంక, ఫిలిప్పైన్స్, దక్షిణ కొరియాల్లో స్థానికంగా బలమైన బౌద్ధ, ఇస్లాం మతాలలోను ఈ ధోరణులు ఆవిర్భవిస్తున్నాయి.

అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలలోని మత వర్గాలలో పైకం పేద శ్రేణులలో ఈ విమోచన మతవాద ధోరణులు తలఎత్తుతున్నాయి. నిరుద్యోగులు, వృద్ధాప్య పెన్షనర్లు, వలస కార్మికులు, వాతావరణ సంరక్షక, అణుయుద్ధ వ్యతిరేక శ్రేణులలో ఈ ధోరణులు తలఎత్తుతున్నాయి.

బ్రెజిలియన్ మతప్రచారకుడు బాఫ్ ఇలా అంటున్నాడు:

"'ఆకాశంలో స్వర్గం'కాదు. 'భూమిమీద స్వర్గం' అనే నినాదం అవసరం." నిరర్థకమైన పిడివాదం స్థానే, కార్యాచరణకు త్రోవతీసే తత్వశాస్త్రం అవసరం ప్రజలతో ముఖ్యంగా పేదప్రజలతో సత్సంబంధమున్న మతవాదులనుండి ఈ ధోరణులు తల ఎత్తుతున్నాయి.

## మూడు స్థాయిలలో విమోచన

పైన పేర్కొన్న గుస్టెవో గుటిరెజ్ వ్రాసిన గ్రంథాన్ని మరింత లోతుగా పరిశీలించుదాం.

ఎవరినుండి ఎవరికి విమోచన కావాలి. మార్క్సిస్టులకు, మతవాదులకు మధ్య ఐక్యకార్యాచరణ ఎలా ఏర్పడాలి. ఫైడల్ కాస్ట్రో మొదటిసారిగా ఈ విషయం ప్రస్తావించాడు. కేవలం లోపాలను గురించి వాపోతూ ధ్యానం చేయడంవలన లాభం

లేము. దుఃఖసముద్రంనుండి బైటపడే మార్గం ఆలోచించాలి. బ్రెజిలియన్ మతాచార్యుడు లియోనార్డో బాఫ్ ఇలా అంటాడు. "స్వర్గం గురించి ఊహలు చేస్తూ, భౌతిక ప్రపంచాన్ని గురించి మరచిపోనక్కరలేదు. ఈ భూమిమీద మనం ఏమి చేస్తామో దాని పైననే స్వర్గసుఖాలు ఆధారపడి ఉన్నాయి." తత్వవేత్తలు ఇంతవరకు వ్యాఖ్యానాలు మాత్రం చేశారు. కాని ప్రపంచాన్ని మార్చటం ముఖ్యం" అని మార్క్స్ చెప్పిన మాటలను ఈ మతాచార్యుడు ఉల్లేఖించాడు.

మూడో ప్రపంచ దేశాలలో 500 మిలియన్ల ప్రజలు నివసిస్తున్నారు. ఆకలి బాధతో వీరు నిత్యమూ హరించుకుపోతున్నారు. ఒక బిలియన్ ప్రజలు నికృష్ట దారిద్ర్యంలో మునిగి ఉన్నారు. 1 1/2 బిలియన్ ప్రజలకు కనీస వైద్యసౌకర్యాలు కూడా అందుబాటులో లేవు. 500 మిలియన్ ప్రజలు నిరుద్యోగులుగా ఉన్నారు 814 మిలియన్ ప్రజలు నిరక్షరాస్యులు.

విమోచన భావన మూడు స్థాయిలలో సాగుతుంది.

1) సామాజిక రాజకీయ స్థాయి. (పీడిత ప్రజల సామాజిక విమోచన)

2) చారిత్రక, విమోచన—సమాజానికి కేంద్ర బిందువైన వ్యక్తి అన్ని రంగాలలోను స్వేచ్ఛాపౌరుడుగా విముక్తి కావటం.

3) మతపరమైన విముక్తి—పాపంనుండి విముక్తి చెంది దైవంతో లీనం కావటం.

ఈ మొదటిస్థాయి విమోచన ననుసరించి రాసే సందర్భాలలో పై రచయితలు మార్క్స్ భావాలకు చాలా సన్నిహితంగా వస్తారు. "మానవాళి దోపిడీవారుఖ, దోపిడీ చేయబడేవారు; ఉత్పత్తి శక్తులపై యాజమాన్యం కలిగినవారు; తమ శ్రమ ఫలితం తమకే దక్కనివారు అనే విరుద్ధవర్గాలుగా విభజితమై ఉన్నారు. వర్గపోరాటం వాస్తవం. ఈ విషయంలో తాటస్థ్యం అనేది సాధ్యం కాదు. సామాజిక సామరస్యాన్ని గురించి కవిత్వం చెప్పి ప్రయోజనం లేదు. కొందరు సృష్టించిన అదనపు శ్రమను మరికొందరు స్వాహాచేసే సమాజం అంతం కావాలి."

"ఇట్టి సమాజం అవతరించాలంటే మన కండ్లఎదుట జరిగే వర్గపోరాట లో పాల్గొనాలి. అలా చేయకపోవడమంటే, ధనికవర్గాలతో చేతులు కలపడమే అవుతుంది. ఏ సాకుతోనైనా ఈ పోరాటంలో పాల్గొన నిరాకరించటం, దైవద్రోహం."

బ్రెజిలియన్ మతప్రచారకుడు లియోనార్డోబాఫ్ తన అభిప్రాయాలను ఇలా వ్యక్తం చేస్తున్నాడు: "ఒక చారిత్రక క్రమంలో సమాజంలో దారిద్ర్యం అనేది ఏర్పడ్డది. కొందరు, మరికొందరిని దోపిడీ చేస్తున్నారు. ఉత్పత్తి క్రమంనుండి, నిరుద్యోగులు, అర్ధ నిరుద్యోగులు, పేదప్రజానీకం పక్కకు నెట్టబడుకున్నది. దారిద్ర్యం ఒక సమస్య. వ్యక్తిగత పాపపుణ్యాల ఫలితంకాదు. కనుక దారిద్ర్యాన్ని

సామూహికంగానే పారద్రోలాలి. ప్రత్యామ్నాయ సమాజాన్ని స్థాపించాలి. దారిద్ర్యం సంఘర్షణా ఘటనలకు మూలం. మౌలిక విప్లవం ద్వారానే నూతన సమాజం ఏర్పడుతుంది. ఈ విప్లవంలో పేదవారు 'కర్త', కర్మ కారు."

వర్గపోరాటాన్ని గురించిన శాస్త్రీయ అవగాహన కాక, పేద, ధనిక అనే విభజనను వారు చేస్తూ ఉంటారు. ఈ బలహీనతను మనం గుర్తించాలి. దీని మత్యపరచరాదను.

మరికొన్ని ఆసక్తికరమైన భావాలను కూడా వీరు వెలిబుచ్చుతున్నారు.

బాఫ్ సోదరులు ఇలా అంటారు: "దేవుని పుత్రులమైన మనము ఇతర చారిత్రక శక్తులతో కలిసి, సమాజ పరివర్తనా కార్యక్రమానికి, వ్యూహం, ఎత్తుగడలు రూపొందించుకోవాలి. ప్రజలను కార్యరంగంలోకి తీసుకురావాలి. నిర్ణయానికి, కార్యాచరణకు మధ్యగల అడ్డుగోడను పగులగొట్టాలి."

చారిత్రక, మానవ పరిణామస్థాయిలో విముక్తి అనే భావనలో కూడా మార్క్సిస్టు భావనల ప్రభావం వీరి ఆలోచనలో కనిపిస్తున్నది. గుటెరాజ్, అతని అనుచరుల దృష్టిలో మానవుడు, చరిత్ర సృష్టి, శ్రమ కార్యాచరణ ఫలితం. మానవ చరిత్ర ఒక నిరంతరాయ క్రమం. ఈ క్రమంలో ప్రజలు తమ భవిష్యత్తును తామే చైతన్యయుతంగా నిర్ణయించుకుంటారు. వాంఛనీయమైన సామాజిక పరిణామాలకు జవసత్వాలు చేకూర్చుకుంటారు. "మానవుని సర్వతోముఖ అభివృద్ధి లేనిదే ఇది సాధ్యం కాదు. సృజనాత్మకమూ, వాస్తవమూ అయిన స్వేచ్ఛను మానవుడు పొందాలంటే, నిరంతర సాంస్కృతిక విప్లవం కొనసాగుతూ ఉండాలి. గుణాత్మకంగా నూతనమైన సమాజం, మానవుడు ఆవిర్భవించాలి

ప్రస్తుత సమాజంలో నైతికసూత్రాలు ఘోరంగా ఉల్లంఘించబడుతున్నాయి. మతవాదులు. మార్క్సిస్టులు ఉభయులు ఈ విషయం గుర్తిస్తున్నారు. మానవులలో వ్యక్తిగతంగా ప్రవేశించే బలహీనతలకు సైతం, సామాజిక వ్యవస్థ ఒక ప్రధాన కారణం. ఈ అంశాన్ని మతవాదులు ఆమోదిస్తున్నారు. పెట్టుబడిదారీ వ్యవస్థ అమానుషాలకు, అన్యాయాలకు పుట్టినిల్లని, నూతన మానవసృష్టి ప్రత్యామ్నాయ వ్యవస్థ అయిన సోషలిస్టు వ్యవస్థలోనే సాధ్యమని కూడా వీరు భావిస్తున్నారు.

మెక్సికో బిషప్ మెండెజ్ ఇలా అంటున్నాడు. "క్రైస్తవ మూలసూత్రాలైన సోదరత్వ న్యాయం, శాంతి భావనలకు, సోషలిజం చాలా దగ్గరగా ఉంది. దక్షిణ అమెరికా ఎలాంటి సోషలిజం ఎన్నుకుంటుందో నాకు తెలియదు అది ప్రజాస్వామ్య సోషలిజంగా ఉండాలని నా భావన. కాగా బాఫ్ సోదరులు మధ్యే మార్గంగా, కాపిటలిజం, సోషలిజం కాకుండా, ఒక నూతన సామాజిక వ్యవస్థ కావాలి అంటారు.

అంటేదాని అర్థం, ఈ మతవాదులు, అస్తిత్వంలో ఉన్న సోషలిజాన్ని ఆమోదిస్తున్నారని కాదు. ముఖ్యంగా స్టాలిన్ నేరాలు, మావో 'సాంస్కృతిక విప్లవం ఉదంతాలు, సోషలిస్టు దేశాలు అనుభవిస్తున్న ఆర్థిక ఇబ్బందులు - ఇవన్నీ సహజంగానే వారి వ్యతిరేకతకు కారణాలు.

ఈ ఉద్యమంలో కొందరు కరుడుగట్టిన కమ్యూనిస్టు వ్యతిరేకులు కూడా ఉన్నారు. భౌతికవాదుల, మానవుని ఆత్మ ప్రాధాన్యతను గుర్తించకపోవటం అన్ని పాపాలకు మూలమని, సాంప్రదాయ ధోరణిలో వారు భావిస్తారు. భౌతిక ఉత్పత్తి క్రమంలో రూపొందే నూతన మానవుని గురించి ప్రస్తావించే వారు అంటే వీరికి అభిమానం.

అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో నూతన ఆలోచనా క్రమం ప్రారంభమైన కారణంగా, ఇలాంటి ప్రజాతంత్రవాద, మతవాదశక్తులతో, స్నేహ, సహకారాలకు మార్గం సుకరమౌతున్నది. ఫెడరల్‌కాస్ట్రో ఇలాఅన్నాడు: "బైబిలులోని ఆదేశాలన్నిటినీ మనం ఆమోదించవచ్చు. ఏమంటే, అవి మన ఆశయాలకు చాలా దగ్గరగా ఉంటాయి." ఎటుదిరిగి ఈ ఆదేశాల చుట్టూ ఉన్న దైవభావన మాత్రమే మనకు అభ్యంతరకరం. ఈ సంగతి గుటిరెజ్‌కు తెలుసు. తెలిసి కూడా ఇలా అంటున్నాడు: "మానవ నైతిక విలువల ప్రాశస్త్యాన్ని క్రైస్తవమతం మాత్రమే చెబుతుందనుకోవడం పొరపాటు. మార్క్సిజంలోనూ ఈ భావసారూప్యత ఉన్నది. యువ మార్క్సును గురించి చర్చించే సందర్భంలో ఆయన పై మాటలను ఆయన అన్నాడు.

ఏసుక్రీస్తును గురించి వారి భావన కూడా ఎంగెల్స్ భావనకు దగ్గరగా ఉంది. క్రైస్తవ మతంలోని విప్లవ స్వభావాన్ని వీరు హెచ్చుగా ప్రస్తావిస్తారు. ఆధునిక ప్రజా ఉద్యమాలతో వాటిని పోలుస్తారు. క్రీస్తు ఆదేశాలే కాదు. ఆయన జీవితం, ముఖ్యంగా రోమన్ సామ్రాజ్యంలోని పేదలతో నికృష్టులతో ఆయన పొందిన తాదాత్మ్యం వీరిని బాగా ఆకర్షించింది. అందుకనే వీరు ఇలా అంటారు: "రాజకీయ ఖైదీగా జీసస్ అనుభవించిన జీవితం మాకు ఆదర్శం. మత ప్రచారం ద్వారా ప్రజలను రాజకీయ చైతన్యవంతులను చేయడం మా లక్ష్యం."

కాగా తాత్విక స్థాయిలో, ఈ మతవాదులకు, కమ్యూనిస్టులకు పోలికలు తక్కువ.

'దేవుడు', 'పాపం' అనే భావాలు చారిత్రిక భౌతికవాదంలో ఇమడలేవు. కాగా ఇక్కడా ఒక విశేషం ఉంది. 'పాపం' వైయక్తికంకాదని, సామాజికమని వారు భావించటం విశేషం. "పాపం నశించాలంటే, రాజకీయ, సామాజిక విమోచన అవసరం" అని వీరు చెప్పేమాట ఎంతో అర్థవంతం.

పోప్ ఆధ్వర్యాన నడిచే మత సంస్థలలోని, పెత్తందారీ అంతస్తుల విధానాన్ని, అగ్రశ్రేణి ధోరణిని, ప్రజలకు దూరంగా వారు నిశితంగా విమర్శిస్తారు. బాఫ్ ఇలా రాస్తున్నాడు: "చర్చి గురువులు ప్రజలతో సంబంధాలను తెంచుకున్నారు. వారు ప్రజలను మరచిపోయారు."

సారాంశం ఏమంటే, కాథలిక్ మత స్థానాలలో, అభివృద్ధి నిరోధకులు, అభ్యుదయవాదులు ఇద్దరు ఉన్నారు. వీరు ఒక రకమైన సహజీవనం చేస్తున్నారు. మైనారిటీలో ఉన్న విప్లవ ప్రజాతంత్రవాదులు కొత్తతరహా చర్చిని నిర్మించాలని ప్రయత్నిస్తున్నారు.

## అంతః సంఘర్షణ

ఈ కారణాన చర్చిలో మితవాద వర్గాలు, మైనారిటీపై తీవ్ర ఆరోపణలు చేస్తూ దాడి చేస్తున్నారు. ఆరోపణలు ఇలా ఉంటాయి. 1) మార్క్సిస్టు భావజాలాన్ని ఈ మితవాదులు ఉపయోగిస్తున్నారు. 2) ఏసు క్రీస్తు మహత్యాలన్నీ తీసివేసి, కేవలం ఒక చారిత్రక వ్యక్తిగా భావిస్తున్నారు—ఇవి వారు చేసే ఆరోపణలు.

విమోచన మతవాదులు వర్గపోరాట సిద్ధాంతాన్ని ఆమోదిస్తున్నారు. పెట్టుబడి దారులు, కార్మికులు సహజీవనం చేయాలనే క్రైస్తవ మతవాదనను నిరాకరిస్తున్నారు. అందరినీ ప్రేమించు అనే క్రైస్తవ బోధను వారు ఆమోదించరు. గుటెరెజ్ ఇలా అంటున్నాడు: "పీడిత ప్రజలను విముక్తి చేయాలనే లక్ష్యాన్ని చర్చి చేపట్టినప్పుడే, విశ్వమానవ ప్రేమ సిద్ధాంతం నిజమౌతుంది. కేవలం పేద ప్రజలపట్ల సానుభూతి, సంఘీభావం చాలదు. వారి విముక్తికై పోరాడాలి."

మానవాళిలో మూడింట రెండు వంతులు, దైవవిశ్వాసం కలవారు వీరిలో హెచ్చుమంది మూడో ప్రపంచ దేశాలలో, లాటిన్ అమెరికాతోసహా ఉన్నారు. ఈ ఖండాలలో విమోచన మతవాదం తలెత్తుతున్నది. బూర్జువా వర్గానికి సేవ చేయటంకాక, పేదప్రజలకు సేవచేయడం, వీరి విమోచనకు పోరాడడం, క్రైస్తవమత లక్ష్యం కావాలని వీరు అంటారు.

సృజనాత్మక మార్క్సిజం లక్ష్యాలకు, వీరి లక్ష్యాలకు పెద్ద తేడా లేదు. మతంపట్ల అసహనం పనికిరాదనే నూతన ఆలోచనా విధానం దృష్ట్యా కూడా, వీరి భావాలు మార్క్సిజానికి సన్నిహితంగా ఉన్నాయని గుర్తించవలసి ఉంది. చర్చి తప్పనిసరిగా, బూర్జువావర్గ స్వార్థాన్ని బానిస కావలసిన అనివార్యత ఏదీ లేదని విమోచన మతవాదులు భావిస్తున్నారు. "చర్చి బూర్జువా వర్గంతో తనకేర్పడిన చారిత్రక బంధనాన్ని తెంచుకొని విప్లవ ప్రజాసేవలో నిమగ్నం కావచ్చు".

ఇది వీరి ఆశాభావం కనుకనే, దైవభావన కలిగిన విశ్వాస పరులకు, మార్క్సిస్టులకు మధ్య సంభాషణలకు, సహకారానికి అపార అవకాశాలు ఏర్పడుతున్నాయి.

# 2013 వ సంవత్సరం
# కొత్త శకానికి ఉషోదయమా?

రిచర్డ్ క్లార్క్
(గ్రేట్ బ్రిటన్ కమ్యూనిస్టు పార్టీ)

*అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలలో 'సమాచారం' 'పారిశ్రామికానంతర సమాజం' అన్న భావనలతో ఒక అధికారిక ఆర్థిక విధాన ధోరణి అధికారికంగా ముందుకు వస్తుంది. ఇది దూరదృష్టితో కూడిన వైఖరా, లేక హ్రస్వదృష్టితో కూడిన వైఖరా? పెట్టుబడిదారీ విధానంలో అభివృద్ధి చెందిన శాస్త్ర, సాంకేతిక విప్లవంతో ముడిపడి వున్న ప్రశ్న, ఇంకా ఇతర ప్రశ్నల మీద చర్చను ఇటీవల కాలంలో మార్క్సిస్టులు ప్రారంభించారు. ఇదే ఈ వ్యాసంలో వస్తువు.*

శాస్త్ర, సాంకేతికశాస్త్రపు ప్రధానమైన, సమగ్రమైన, పరివర్తనాపాత్రను గురించి పెరుగుతున్న అప్రమత్తత 1960 దశకంలోనూ, 70 వ దశకం ప్రారంభం లోనూ ఒక సాంప్రదాయాన్ని ముందుకు తీసుకొచ్చింది. దీని ప్రకారం, నూతన సాంకేతిక విప్లవం ఒక నూతన శకంలోనికి ఒక విధమైన "పారిశ్రామికానంతర" "సమాచార సమాజం" లోనికి ప్రవేశిస్తుంది. 1981 తరువాత, పెట్టుబడిదారీ విధానం కోలుకుంది. దీంతో మరల ఈ భావనలు ఊపును అందుకున్నాయి.

ప్రతిచోట లభ్యమయ్యే "సిలికాన్ చిప్" ప్రాతిపదికగా మన సాధారణ దృష్టిని అధిగమించి వెళ్ళగల పద్ధతులను "సమాచార సాంకేతిక శాస్త్ర విప్లవం" రూపొందిస్తుంది. "రాజ్య రహిత సమాజం", "భూగోళ గ్రామం", "సాంకేతిక సామ్య ప్రపంచం" లాంటి పదజాలాన్ని వినియోగించడం ద్వారా మైక్రో ఎలక్ట్రానిక్స్, టెలికమ్యూనికేషన్ ఇత్యాది రంగాలమీద అధికాధికంగా కేంద్రీకరిస్తున్నారు. రానురాను క్లిష్టతరమౌతున్న "సమాచార శకం" వివిధ రూపాలుగా వీటిని పరిగణిస్తున్నారు. పనిని, విద్యని, ప్రజా శ్రేణులను, మనం సాగించే

జీవనాన్ని, ప్రపంచాన్ని మనం అర్థం పద్ధతిని ప్రాథమిక మార్చివేయగల రూపాలు వీటిని యెంచుతున్నారు.

ఈ ఊహాగానాలు ఎంతవరకు సమంజసం? గానున్న మార్పులను అర్థం చేసుకొనడానికి మార్క్సిస్టు విశ్లేషణ ఎలాంటి సునిశితత్వాన్ని అందించనున్నది?

వెంటనే వచ్చే ఒక స్పందన మాత్రం స్పష్టమే: సరైన చారిత్రక దృక్పథం మనకు మార్గదర్శకం అవుతుంది. నూతన మైక్రో ఎలక్ట్రానిక్స్, సమాచార సాంకేతిక పరిజ్ఞానంతో ముడిపడివున్న తీవ్రమైన మార్పుల విశ్లేషణకు కార్మికవర్గం మౌలిక కేంద్రం కావాలి. ప్రపంచ వ్యవస్థగా పెట్టుబడిదారీ విధానం ఎదుర్కొంటున్న తీవ్రమైన అంతర్జాతీయ సంక్షోభంనుండి బయటపడటానికి శాస్త్ర, సాంకేతిక పరిజ్ఞానాన్ని బహుముఖంగా వినియోగించుకుంటుంది. మరొక విధంగా చెప్పాలంటే, బూర్జువా ఆధిపత్యాన్ని నిలుపుకోవడానికి శాస్త్ర, సాంకేతిక పరిజ్ఞానాన్ని ఉపయోగించుకోవడం జరుగుతుంది. పశ్చిమదేశాల సామాజిక శాస్త్రాలలో సుస్థాపితమైన "సమాచార విప్లవం", పారిశ్రామికానంతర సమాజం" లాంటి భావనలను ఈ దృక్కోణం నుండి మన పరిగణనలోనికి తీసుకోవలసి ఉంటుంది.

## నూతన సాంప్రదాయవాదుల భవిష్యత్ నమూనా

1970వ దశకం ప్రారంభంలో, రెండవ ప్రపంచ యుద్ధానంతరం పెట్టుబడిదారీ విధాన "దీర్ఘకాలిక మహర్దశ" చరమ స్థాయిలో ఉండగా హార్వర్డు విశ్వవిద్యాలయంలోని సామాజిక శాస్త్రవేత్త డేనియల్ బెల్ "రానున్న పారిశ్రామికానంతర సమాజం" అన్న గ్రంథాన్ని రాశాడు. అభివృద్ధిచెందిన పెట్టుబడిదారీ దేశాలలో (ఉద్యోగావకాశంలోనేకాక ఆర్థిక కార్యాచరణలోను సంపద సృష్టిలోను) పారిశ్రామికులకంటే సాపేక్షంగా సర్వీసు రంగం ప్రాముఖ్యత పెరుగుతుందని ఆ పుస్తకంలో డేనియల్ నిరూపించడానికి ప్రయత్నించాడు. సోషలిజా విర్భావానికి పారిశ్రామిక విప్లవం అనుకూల పరిస్థితులను కల్పిస్తే "పారిశ్రామికానంతర" విప్లవం పెట్టుబడిదారీ విధానం పరివర్తనకు దారితీస్తుందని, దీనిలో సోషలిజానికి కాలం చెల్లిపోతుందని ఆయన పేర్కొన్నాడు.

అప్పటినుండి ఈ భావాలను అనేకమంది పుణికి పుచ్చుకొని ప్రచారం చేస్తున్నారు. వీరందరిలో ప్రత్యేకించి "భవిష్యత్ దిగ్భ్రాంతి", "మూడవ కెరటం" అన్న పుస్తకాలలో ఆ గ్రంథాల రచయిత అల్విన్ టఫ్లర్ ఈ భావాల ప్రచారానికి తీవ్ర కృషిసల్పాడు. నూతన సాంప్రదాయకవాదుల మితవాద విధానాలకు అనుకూలంగా "పారిశ్రామికవాదనంతర దశ" అన్న భావాన్ని మార్చడానికి టఫ్లర్ ప్రచారం బాగా దోహదం చేసింది.

అప్పటి నుండి ఒక పాతిక సంవత్సరాలుగా జరుగుతూ వస్తున్న మార్పులను స్పష్టంగా ఇవ్వటానికి "నూతన సమాజం" (న్యూ సొసైటీ) అన్న పత్రికలో ఒకే సంపుటిలో వచ్చిన రెండు వ్యాసాలలో రచయితలు ప్రయత్నించారు. మొదటి వ్యాసాన్ని డేనియల్ బెల్ రచించారు. డేనియల్‌ను ప్రపంచంలోని అత్యంత గొప్ప సామాజిక శాస్త్రవేత్తగా పేర్కొనడం కూడా జరిగింది. "కంప్యూటర్లు, టెలి కమ్యూనికేషన్‌లు ఒక పెద్ద భిన్నమైన వ్యవస్థగా, అంటే "నిస్తంత్రీ జాతి"గా, ఇంకా చెప్పాలంటే "ప్రపంచ సమాజం"గా— 2013 వ సంవత్సరం నాటికి మూడవ సాంకేతిక విప్లవం పరిపక్వం చెందనున్నదని డేనియల్ ప్రకటించారు. అదే సంపుటిలో మరో వ్యాసంలో, బ్రిటన్ ఆర్థిక, సామాజిక పరిశోధనా కమిటీ అధ్యక్షులు పీటర్ హాల్, డేనియల్‌తో స్వరం కలిపారు. "2013 వ సంవత్సరం నాటికి మాది మొదటి పారిశ్రామికానంతర సమాజం" కానున్నది బల్లగుద్ది మరీ ప్రకటించాడు. సాంకేతిక ప్రగతి, "సమాచార శకం" యొక్క అనివార్య ఫలితమే "మూడవ కెరటం"గా వర్ణించబడింది. పారిశ్రామిక దశలో తనను పట్టుకొని ఇప్పటికి పీడిస్తున్న అంటువ్యాధి రానున్న నూతన శకంలో పెట్టుబడిదారీ విధానం వదిలించుకోనున్నదని కూడా పేర్కొంటున్నారు.

## పెట్టుబడిదారీ విధానం మనగలదా ?

దశలవారీగా వచ్చే ఆర్థిక మాంద్యం కొత్త విషయమేమీ కాదు. ఎంతో కాలంగా ఇవి పారిశ్రామిక పెట్టుబడిదారీ విధాన చరిత్ర లక్షణాలుగా ఉంటూ వస్తున్నాయి. పరిపక్వ దశకు చేరుకొనడం ద్వారా పెట్టుబడి విధానం సంక్షోభరహిత నూతన దశకు చేరుకుందనే భావనలకు రెండవ ప్రపంచ యుద్ధానంతర పరిస్థితులతో పశ్చిమ యూరప్ దేశాలకు అవకాశం ఏర్పడిన పరిస్థితి సాపేక్షంగా వాస్తవమైనదే. కాని, ఈ ఊహాగానాలు కాల పరీక్షను తట్టుకొని నిలబడలేకపోయాయి. 1987, ఆగస్టు-అక్టోబర్ మాసాల మధ్య న్యూయార్క్, లండన్, టోక్యోలలో స్టాక్ మార్కెట్ కుప్పకూలిపోయింది. దీనితో 1981 చివరలో అనేక పెట్టుబడిదారీ దేశాలలో సంభవించిన "మహర్దశ" ముగింపు దశకు చేరుకొన్నదని చెప్పవచ్చు.

"స్వల్పకాలిక వలయాల"ను మొదట మార్క్స్ అధ్యయనం చేశాడు. ఇప్పుడు ఆ విషయాన్ని సుస్థాపితమైన విషయంగా ఆర్థిక శాస్త్రంలో అంగీకరిస్తున్నారు. ఈ వైఖరిని 1930–80 మధ్యకాలం ధృవీకరించింది. అలానే గత చరిత్రలో ముఖ్యమైన మాంద్య దశలు కూడా నిరూపించాయి. యుద్ధానంతరం ప్రారంభమైన ఊపు, 1970 వ దశకం మధ్య భాగంలో ప్రజ్వరిల్లిన సంక్షోభం ముగింపుకు వచ్చింది. అలానే పెట్టుబడిదారీ విధానపు దీర్ఘకాలిక ఆర్థిక మాంద్యం ప్రారంభమైంది. దీనితో, పశ్చిమ దేశాలలో "దీర్ఘ కెరటం" పట్ల ఆసక్తి పెరిగింది. 1920 వ దశకంలో ఈ భావనను సోవియట్ ఆర్థికవేత్త నికొలాయ్ కొంద్రటీవ్ ముందుకు దూసుకువచ్చాడు. స్వల్పకాలిక, దీర్ఘకాలిక వలయాలలో పరిధిలో అభివృద్ధి విజయం, మాంద్యం వెనుకగల కారణాలను వివరించటానికి ఇవి తోడ్పడేవి.

అర్ధ శతాబ్ది గడచిన ఈ కెరటాల స్వభావాన్ని క్రిందివిధంగా చూపవచ్చు.

| ఊర్ధ్వాభిగమనం | అధోభిగమనం |
|---|---|
| * నూతన సాంకేతిక పరిజ్ఞానం | * పరిపక్వమైన సాంకేతిక పరిజ్ఞానం |
| * ఉద్యోగాల సృష్టి | * ఆర్థిక స్తంభన |
| * ఆర్థిక పెరుగుదల | * లాభాలు తగ్గడం |
| * పెరిగిన లాభాలు | * విధేయులైన శ్రామికులు |
| * సమరశీల శ్రామికులు | * ఊర్ధ్వాభిగమనంపైన పెట్టుబడిదారుల దాడులు |
| * పాలకవర్గాల రాయితీలు | |
| * జీవన ప్రమాణాల పెరుగుదల | * జీవన ప్రమాణాల తగ్గుదల |

ఒక ప్రత్యేకమైన సాంకేతిక పరిజ్ఞానాభివృద్ధితో ప్రతి దీర్ఘకాలిక ఆర్థికాభివృద్ధి, క్షీణత కలిసి ఉండడం జరుగుతుంది. నూతన విషయాల ఆవిష్కరణ నిరంతరమైన క్రమం. కాని ఇవన్నీ ఎక్కువ అభివృద్ధి జరిగిన కాలంలోను సంభవిస్తూ వచ్చాయి.

నూతన సాంకేతిక పరిజ్ఞానం వల్లనే ఈ అభివృద్ధి సాధ్యమైంది. అయితే ఈ నూతన పరిజ్ఞానమంతా నిరాసక్తతతో జరిగిన 'పరిశోధన'లో భాగంగా ముందుకు రాలేదు. దీర్ఘకాలిక వ్యూహాలు, పెద్ద కంపెనీల కృషిఫలితమే ఈ పరిశోధన. 1970 వ దశకం మధ్య భాగం నుండి తలెత్తిన నూతన పరిస్థితులలో, ఉత్పత్తి క్రమాన్ని చిన్న చిన్న ముక్కలుగా విడగొట్టడం ద్వారా నైపుణ్యతలేని వారిని పనిలో నియమించడానికి బహుళజాతి కంపెనీలకు అవకాశం కలుగుతుంది. ఈ విధంగా కార్మికవర్గాన్ని ప్రపంచ వ్యాపితంగా పునర్నిర్మించడానికి ప్రయత్నాలు జరుపుతున్నారు.

దీనివలన బ్రిటన్‌లో నిపుణత్వం కలిగి, పూర్తికాలం పనిచేస్తూ, సాపేక్షంగా సుభిమయంగాఉండే కార్మికులు కొద్దిమంది ఒకపక్క, పూర్తికాలం పనిలేక నైపుణ్యంలేని, అస్తవ్యస్తమైన కార్మికులు ఎక్కువ సంఖ్యలో మరొక పక్క నిలుస్తున్నారు దీనితో ఎన్నికల్లో గందరగోళం ఏర్పడి, వామపక్షాలకు పరాజయం ఎదురౌతున్నది. దీనివలన మరోపక్క నూతన, 'రాడికల్ మితవాదం' ఒక కొత్త అభివృద్ధి నిరోధక జాతీయ జనాకర్షణవాదం ప్రబలుతున్నది. దీనికి సమర్థవంతమైన ప్రత్యామ్నాయాన్ని వామపక్షాలు ఇంకా చూపలేకపోతున్నాయి.

మూడవ ప్రపంచ దేశాల ఆర్థిక వ్యవస్థలలో తీవ్రంగాను, వేగంగాను జరుగుతున్న మార్పులలో ప్రస్తుతం పెట్టుబడిదారీ వ్యవస్థ ఏ విధంగా పునర్నిర్మించబడుతుందో మనం చూడవచ్చు. మూడవ ప్రపంచంలోని అనేకమంది ప్రజల జీవితాలు వినాశకరంగా మారిపోవడం ఇక్కడ గమనించవచ్చు ఉద్యోగాలు అందిస్తున్న మార్గంగా, నూతన సాంకేతిక పరిజ్ఞానంతో పరిచయం కలగటానికి సోపానంగాను, 'అభివృద్ధి' గమనంగాను, క్లుప్తంగా చెప్పాలంటే, ఉన్నత స్థితిలో ఉన్నవానికి ఆదాయంవచ్చే బాటగా ఈ విషయాన్ని అతిథేయ ప్రభుత్వాలు భావిస్తున్నాయి. ఈ విధానాల ప్రోత్సాహ ఫలితంగా, "విదేశీ ఎగుమతుల మండలాలు", "స్వేచ్ఛావాణిజ్య మండలాలు దక్షిణ, ఆగ్నేయ ఆసియాలలోను, లాటిన్ అమెరికా, ఆఫ్రికాలలో కోకొల్లలుగా వెలిశాయి.

ఆధునిక పరిశ్రమలలో పనిభారాన్ని తీవ్రతరం చేసే యూనిట్లను దక్షిణ కొరియా, ఫిలిప్పైన్స్‌లలో పెట్టనున్నారు. వీటిలో వేతనాలు తక్కువ, పైగా కార్మికులకు ఎలాంటి హక్కులు, కార్మిక సంఘాలు పెట్టుకొనే అవకాశం కాని ఉండదు. బ్రిటన్, ఇటలీ లాంటి దేశాలలో ఉన్నత సాంకేతిక పరిశోధన, అభివృద్ధి, ఉత్పత్తి సౌకర్యాలను నెలకొల్పుతారు.

ఫలితంగా ప్రపంచ పెట్టుబడిదారీ ఆర్థికవ్యవస్థను రెండు భాగాలుగా పునర్నిర్మించడం జరుగుతుంది. నూతన శాస్త్రీయ, సాంకేతిక సామ్రాజ్యవాదంలో ఇది ఒక భాగం వీటితోపాటు అంతర్జాతీయ ద్రవ్యనిధి, ప్రపంచబ్యాంకు మొదలగు విధానాల వలన తృతీయ ప్రపంచ దేశాల అభివృద్ధి అనేక చిక్కులను ఎదుర్కోవలసి వస్తుంది.

ఈ పద్ధతులవలనే యుద్ధానంతర దశలో పుంజుకున్న పెట్టుబడిదారీ ఆర్థిక విధానం తిరిగి 1970 వ దశకంలో తీవ్ర మాంధ్యాన్ని ఎదుర్కోవలసి వచ్చింది. అంతర్జాతీయ ఆర్థికవిధాన పునర్నిర్మాణం ప్రాతిపదిక బహుళజాతి సంస్థల విధానాలలో ఉంది. అయితే, ఈదశలో కూడా స్వల్పకాలిక మాంద్యం ఉంటూనే ఉంటుంది. దీర్ఘకాలిక మాంధ్యము కొనసాగుతున్న కాలంలో స్వల్పకాలిక ఊపు మాదిరిగానే ఇది కూడా. దీనికి ఉదాహరణగా, 1980 వ దశకం ద్వితీయ భాగంలో పశ్చిమ దేశాలలో వచ్చిన ఊపును పేర్కొనవచ్చు. ఇది మొదట ఆశలు రేకెత్తించింది. తరువాత నూతన సాంకేతిక శాస్త్రపు శక్తి సామర్థ్యంపట్లవున్న భ్రమలు పటాపంచలైనాయి.

కాని, దీర్ఘకాలిక మహర్దశ తరువాత "పారిశ్రామిక దశనాంతర" సమాజాన్ని ఊహిస్తున్నవారి ఆశలు అడిఆశలైనాయి. కొన్ని వైరుధ్యాలను తొలగించుకుంటూనే, ఇతరులు భయపడే విధంగా, 2013 తరువాత అనివార్యంగా సంభవించనున్న దీర్ఘకాలిక అధోదశకు కావలసిన పరిస్థితులను పెట్టుబడిదారీ విధానం సృష్టిస్తుంది. కొంద్రటీఫ్ ఆవిష్కరించిన "దీర్ఘ కెరటాల" సారం ఇదే. ఆర్థిక ఉత్పత్తి రంగంలో నూతన సాంకేతిక పరిజ్ఞానాన్ని ప్రవేశపెట్టడం ద్వారా వాటిని క్రమబద్ధం చేయడానికి పెట్టుబడికి చాలా కాలం పడుతుంది మొత్తంగా శాస్త్ర సాంకేతిక విప్లవాభివృద్ధి సాఫీగా అభివృద్ధి చెందటానికి. ఫలితంగా నూతన సమాజ నిర్మాణానికి పెట్టుబడి విధానం అవకాశం కల్పించలేదని దీనర్థం.

## సమాధానాలకంటే ఎక్కువైన ప్రశ్నలు

పెట్టుబడిదారీ వ్యవస్థ దీర్ఘకాలిక అస్తవ్యస్తతను, తత్సంబంధిత సమస్యలను విశ్లేషించడానికి "సమాచార సాంకేతిక విప్లవ" ప్రవర్తకులకు 'దీర్ఘ కెరటాలున్న భావ చట్రపరిధిలో అవకాశం లేదు. ప్రస్తుత పారిశ్రామిక పెట్టుబడిదారీ విధానంలోని అనివార్యంగా సంభవించే తీవ్ర మాంధ్యాన్ని వివరించటానికి పీటర్ హాక్ ఈ భావాన్ని వినియోగించుకొన్నాడు. నిరుద్యోగం, సంక్షేమ కార్యక్రమాల్లో కోత సాంకేతిక మార్పుల అనివార్య ఫలితాలే ఇందుకు ఎవర్ని నిందించరాదు.

పోషలిస్టు ప్రపంచంలోని కొంతమంది విద్యావేత్తలు. నూతన సాంకేతిక పరిజ్ఞాన పర్యవసానలను గురించి చర్చించేటప్పుడు పశ్చిమ దేశాలనుండి వచ్చే

సామాజిక సిద్ధాంతాలను వెనుకా ముందూ లేకుండా ఒప్పుకుంటున్నారు. సమకాలీన పెట్టుబడిదారీ విధానాభివృద్ధిని పలువిధాలుగా విశ్లేషించడంలో కొండ్రటివ్ "దీర్ఘ కెరటాల" భావానికిగల సైద్ధాంతిక అనుగుణ్యతను అర్థం చేసుకోవడంలో వాగు విఫలమయ్యారు

దీన్నే సరళంగా మరో విధంగా చెప్పవచ్చు. ద్వితీయ (తయారీ) రంగం నుండి తృతీయ (సర్వీస్) రంగానికి జరుగుతున్న మార్పు "పారిశ్రామికానంతర సమాజం" ఆవిర్భావానికి అవసరమని బెల్, అతని మద్దతుదారులు మరొక సిద్ధాంతాన్ని ముందుకు తీసుకొస్తున్నారు. ఆర్థిక వ్యవస్థ ప్రధాన ఉత్పత్తిగా సర్వీస్ రంగం ముందుకొచ్చిందన్న విషయం ఈ సిద్ధాంతానికి ప్రాతిపదిక. ఫలితంగా ఉద్యోగావకాశాల చట్రంలో గణనీయమైన మార్పు వచ్చిందనేది కూడా ఈ సిద్ధాంతానికి ఆధారం. ఇ.సి.డి దేశాలలోని 60 శాతం ఉద్యోగాలలో సర్వీసురంగానికి చెందిన వనుకుందాం. దీనిలో 'తెల్లచొక్కా' ఉద్యోగులను కూడా చేరిస్తే, ఈ సంఖ్య 80 శాతానికి పెరుగుతోంది.

దీనికి అనేక కారణాలు ఉన్నాయి. కార్యాలయాలు, బ్యాంకులలో పనిచేసే వారితో పోల్చినప్పుడు, ఉత్పత్తి రంగంలో పెరిగిన శ్రామిక ఉత్పాదకత ఇందుకు మొదటి కారణం. దీనివలన, సర్వీస్ రంగం పునర్నిర్మించడానికి ప్రథమ లక్ష్యమైంది.

సర్వీస్ రంగంతో పోల్చుకున్నప్పుడు తయారీ రంగంలోని ఆర్థిక ప్రాముఖ్యత తగ్గుదల సాపేక్షమైనది పెరుగుతున్న సంపదవలన తయారీ వస్తువుల వినియోగం కూడా పెరుగుతుంది. ఫలితంగా తయారీ వస్తువుల ఉత్పత్తి పెరుగుదలకు ఇది దారి తీస్తుంది వ్యక్తిగత కోర్కెలద్వారా గతంలో జరిపించుకొన్న పనులను ఇప్పుడు పారిశ్రామిక ఉత్పత్తులు నెరవేరుస్తాయి.

విదేశాలలో, ప్రత్యేకించి "నూతన పారిశ్రామిక దేశాల" లోని "వాణిజ్య మండలాల" లో ఉత్పత్తులను పునః కేంద్రీకరించడం కూడా ఎంతో ప్రాముఖ్యత ఉన్న విషయం. 19వ శతాబ్దంలో వ్యవసాయంనుండి పారిశ్రామికీకరణకు జరిగిన మార్పుతో ప్రస్తుత మార్పును పోల్చవచ్చు.

అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలలోని 'సంపద' తయారీ రంగం ద్వారాను, సర్వీసు రంగం ద్వారాను సమకూర్చబడుతుంది. ఉత్పత్తి రంగంలో వచ్చిన వాణిజ్య లోటును పూడ్చుకోవటానికి వీలుగా తగు మోతాదులో విదేశాలకు ఎగుమతి చేయడం దీనికి అవసరం. అంతిమంగా, విషయమేమిటంటే, పెట్టుబడిదారీ సామాజికాభివృద్ధిలో సర్వీస్ రంగానికన్న సాపేక్ష ప్రాధాన్యత కంటె ఉత్పత్తిని ఒకచోట నెలకొల్పడం, "సంపద" ను పంపిణీ చేయడమన్నదే. అదనపు విలువను సృష్టించడంలోను, చలామణిలోను, పెట్టుబడి కేంద్రీకరణలోను

సమాచార సాంకేతిక శాస్త్రానికి ఉన్న పాత్రకు సంబంధించి ఇక్కడ ప్రశ్న తలెత్తింది. దీనినే మొరటుగా చెప్పవలసివస్తే, 'చచ్చి'న శ్రమను దోపిడీచేయడం ద్వారా పెట్టుబడిదారీవిధానం మనగలుగుతుందా? అంతిమంగా, పెట్టుబడి నిర్మూలనకు పురోగామి పారిశ్రామిక పెట్టుబడిదారీ విధానం, అలానే మైక్రో ఎలక్ట్రానిక్స్, సమాచార సాంకేతికశాస్త్రం అవకాశం కల్పిస్తాయా?

సాంకేతిక మార్పులలో ఉన్న ద్విముఖ అంశాన్ని గమనించిన మొదటి వ్యక్తి మార్క్స్. వీటిలో ఒకటి పెట్టుబడి నిరంతరమైన మనుగడకు కేంద్రం. అదే కేంద్రం క్రమేపీ పెట్టుబడి కూలిపోవడానికి గల పరిస్థితులను కూడా సృష్టిస్తుంది. పెట్టుబడిదారీ విధానం పాక్షికంగానే స్వయంచలిత యంత్రాలను తయారు చేస్తుంది. దానితో ఆ విధానంలో అంతర్గత వైరుధ్యాలు పెరిగి, స్వయంచలిత యాంత్రీకరణ క్రమం మందగిస్తుంది. దానితో పూర్తి స్వయంచలిత యాంత్రీకరణ సోషలిజంలోనే జరుగుతుందనే భావనతో కొంతమంది సోషలిస్టులు ఉన్నారు.

పెట్టుబడిదారీ విధానంలో కూడా సమాచార సాంకేతిక శాస్త్రంలో ఎన్నో అనూహ్యమైన విజయాలు రానున్నాయనేది నేటి వాస్తవం. అందుచేత, పెట్టుబడి పునర్నిర్మాణంలో సమాచార సాంకేతికశాస్త్ర పాత్రను పరిశీలించడం అవసరం. "సమాచార సమాజపు" రాజకీయేతర, విమర్శనారహిత దృష్టివలన విశ్వవ్యాపిత పునర్నిర్మాణ క్రమాన్ని విస్మరించడం జరుగుతుంది. ఫలితంగా, రెండు వ్యవస్థల మధ్య పోటీగాను, వర్గ పోరాట లక్ష్యంగా శాస్త్ర, సాంకేతిక విప్లవాన్ని ముందుకు తీసుకెళ్ళడంలోని సామాజిక మార్గాలను విశ్లేషించడంలో విఫలమౌతున్నాం.

'సమాచార విప్లవం' లోనే అపారమైన, అనియంత్రణమైన శక్తి ఉందని చేపే "మూడవ కెరటా" ల వాదనలు నిలవవు. సాంకేతిక మార్పు దశ కాని, దిశ గాని దైవ నిర్ణీతమైనవి కావు. ఇవి రెండు కూడా శక్తివంతమైన సామాజిక, ఆర్థిక శక్తుల ఫలితమే. అలానే, ఈ కార్యక్రమంతో సంబంధం కలిగినవారు, సంస్థలు చైతన్యవంతంగా తీసుకొన్న నిర్ణయాలు దశ, దిశలను నిర్దేశిస్తాయి.

దీనినే యుద్ధానంతర పెట్టుబడిదారీ విధాన చరిత్ర నిరూపించనున్నది.

క్లుప్తంగా, సాంకేతిక ప్రగతినంతా బహుళజాతి కంపెనీలకు, సైనిక-పారిశ్రామిక సముదాయ వర్గాలకు ఆపాదించడం సరికాదు. అనేక వాణిజ్య, పారిశ్రామిక ఆవిష్కరణలకు ప్రాతిపదికగా ఉంటున్న సాంకేతిక అభివృద్ధి కార్యక్రమాలను రూపొందించి, దానికి ఆర్థిక సహాయం అందించడంలో బహుళజాతి సంస్థలు కీలకమైన పాత్రను నిర్వహిస్తున్నాయి. ఇక్కడ ఒక ప్రశ్న అడగవలసి ఉంటుంది. నాటకీయమైన, శక్తివంతమైన సాంకేతిక శాస్త్ర పరిజ్ఞానానికి పెట్టుబడిదారీ విధాన మౌలిక నిర్మాణాత్మక సంక్షోభం తటస్థపడడం అనుకోకుండా జరిగిందా - లేక వాటి మధ్య ఏమైనా సజీవ సంబంధం ఉందా?

విమర్శనాదృష్టి లోపించిన "మూడవ కెరటం" రానున్న "సమాచార సమాజం", లేక ఆవిర్భవిస్తున్న "పారిశ్రామికానంతర సమాజం" అభిప్రాయాలకు ప్రత్యామ్నాయ సిద్ధాంత పరిష్కారం ఉంది. ప్రస్తుత దశ నిర్దిష్ట లక్షణాలను చూడడంలో ఈ ప్రత్యామ్నాయ మార్గం ఇమిడి ఉంది: వర్తమాన పెట్టుబడిదారీ విధానంలోని వైరుధ్యాలను పరిష్కరించడంలోను, ఆర్థిక పునర్నిర్మాణ కార్యక్రమంలోను నిర్మాణ సంబంధమైన సంక్షోభం, సమాచార సాంకేతిక శాస్త్రం ముఖ్యమైన పాత్ర నిర్వహిస్తున్నాయి. ఈ మార్గంలో, ఆర్థిక నిర్వహణలోని తప్పులు, పొరపాటు విధానాల ప్రతీక మాత్రమే సంక్షోభంకాదు.

పెట్టుబడిదారీ విధాన ప్రధాన స్థావరాలలో దీర్ఘకాలిక మాంద్యం, తీవ్రమైన సాంకేతిక మార్పులకు మధ్యగల సంబంధాన్ని అర్థం చేసుకోవడమనే సవాల్ మార్క్సిస్టుల ముందుంది. నూతన సమస్యలను అర్థం చేసుకొనడం ద్వారా నూతన శక్తులను వినియోగించుకోవాలి. అంటే, 1945–73 నాటి దీర్ఘకాలిక మహర్దశ తరువాత ఉన్న భిన్న పరిస్థితులలో మన పోరాట రాజకీయ పద్ధతులను పునరంచనా వేసుకోవాలి.

# స్వాయత్తాన్ని తిరిగి సాధించుకున్న సవిస్టి వ్యవసాయ క్షేత్రాలు

వ్లదిమీర్ మిజిరిత్స్కీయ్

సోవియట్ యూనియన్‌లో ఉజ్బెకిస్తాన్ రిపబ్లిక్కులోని ఖరేజ్మ ప్రాంతంలో వున్న 'పబేద' ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రంలో పత్తి రైతుల బృందానికి బికే అతద్జనోవ నాయకురాలిగా ఉండేది. ఆమె దైనందిన కార్యకలాపాల్లో చిన్నా పెద్దా బ్యూరోక్రాట్లు జోక్యం చేసుకోకుండా ఉంటారని-అయిదేళ్ళ కిందట-చెపితే ఆమె నమ్మి ఉండేది కాదు. అలాగే తన బృందం చేసే పని తాలూకు నాణ్యతపైనా, ఎంత ఉత్పత్తి చేశారనేదానిపైనా ఆధారపడి ఆ బృందానికి ఆదాయం లభిస్తుందని-అయిదేళ్ళ కిందట చెప్పి ఉంటే ఆమె నమ్మలేకపోయేది. గతంలో వ్యవసాయ క్షేత్రాల నిర్వహణతో సంబంధం లేకుండా చక్కగా వేతనాలు అందుకునే స్థానిక, కేంద్రీయ అధికారులు-వ్యవసాయం గురించి ఓనమాలుకూడా సరిగ్గా తెలియనివాళ్ళు-ఎప్పుడు ఎక్కడ విత్తనాలు వెయ్యాలో, ఎప్పుడు పంట కోసుకోవాలో రైతులకు పాఠాలు చెప్పేవాళ్ళు. 'ఇప్పుడు కొత్తగా అమల్లోకి వచ్చిన సహకార సంస్థల చట్టం, క్రమంగా మా భూమికి మమ్మల్నే యజమానులుగా మారుస్తుందని మేం ఆశిస్తున్నాం. ఆజ్ఞా పాలనాబద్ధమయిన నిర్వహణా విధానం గతంలో కలిసి గతించి పోతుందని మా విశ్వాసం' అన్నారు అతదేజనోవ.

అయితే సహకార సంస్థల చట్టం ఆమోదం పొందేంతవరకూ పబేద ప్రభుత్వ వ్యవసాయక్షేత్రం చేతులు ముడుచుకు కూర్చోలేదు. ఒక్కో రైతు కుటుంబానికి కొంత భూమిని కంట్రాక్టు యివ్వడానికి సంబంధించిన చర్చలు జరుగుతున్న కాలంలోనే, ఆ పద్ధతిని అమలుచేయడం ప్రారంభించేసింది 'పబేద' క్షేత్రం. బికే అతద్జనోవ కూడా వ్యవసాయక్షేత్రం వారితో కంట్రాక్టు కుదుర్చుకుని అయిదు హెక్టేర్ల భూమిని కౌలుకు తీసుకుంది. ఈ కంట్రాక్టుల్లో, కౌలు షరతులు, చెల్లింపుల పద్ధతులు, కోటాలు తదితర విషయాలపై-వ్యవసాయక్షేత్రం సరాసరి దిగుబడి ప్రాతిపదికగా-కుదుర్చుకున్న ఒప్పందాలు పేర్కొంటారు. అలాగే, కంట్రాక్టు తీసుకున్న

కుటుంబం, లక్ష్యాలు మించి దిగుబడి చేసినట్లయితే, ఆ కుటుంబానికి అదనంగా యిచ్చే బహుమానాల గురించి కూడా ఈ కంట్రాక్టు పత్రంలో పేర్కొంటారు.

నిజానికి అతద్‌జనోవ కౌలుకు తీసుకున్న భూమి - అయిదు హెక్టేర్లు- పెద్ద విశాలమయిన భూభాగమేమీ కాదు. కానీ ఈ ప్రాంతానికి నీటిపారుదల సౌకర్యం కల్పించే ఖరేజ్మ ఒయాసిస్సు వైశాల్యంలో చిన్నది కావడాన్న యిక్కడ ప్రతి చదరపు మీటరూ విలువయిందే. కారాకుమ్ - కిజిల్‌కుమ్ ఎడారులమధ్యన ఈ ఒయాసిస్సు ఉంది.

198, లో అతద్‌జనోవ కుటుంబం హెక్టేరుకు 45 సెంట్నర్‌ల పత్తి దిగుబడి చేశారు. పబేధ వ్యవసాయక్షేత్రం సరాసరి దిగుబడి మొత్తంకన్నా ఇది 12 సెంట్నర్‌లు ఎక్కువ. మొత్తం ఉజ్బెకిస్తాన్ రిపబ్లిక్ సగటు దిగుబడితో పోలిస్తే అతద్‌జనోవ కుటుంబం చేసిన దిగుబడి రెండు రెట్లు ఎక్కువ. కాని - ఈ దిగుబడి సాధించడానికి ఆ కుటుంబం చేసిన శ్రమ మాత్రం తక్కువ. మొత్తంమీద ఈ కుటుంబానికి వ్యవసాయక్షేత్రం ఆదాయంతో పోలిస్తే 52 శాతం ఎక్కువగా ఆదాయం లభించింది.

'ఈ ప్రాంతంలో, 1987 నాటికి కంట్రాక్టు పద్ధతిలో కౌలు తీసుకున్న కుటుంబాల సంఖ్య 6000 కు చేరింది. ఈ కుటుంబాలు వ్యవసాయక్షేత్రానికి అనేక లక్షల రూబుళ్ళ ఆదాయాన్ని - అదనంగా - సమకూర్చిపెట్టాయి. గతంలో మాదిరిగా ఏ పనికి ఆ పని చొప్పున ఆదాయం లెక్కగట్టి చెల్లింపులు జరగలేదు. దిగుబడిని బట్టి వేతనాలు చెల్లించడం జరిగింది. మరోమాటలో చెప్పాలంటే వేతనాలను విచక్షణా రహితంగా సమానంచేసే పద్ధతికీ, పత్తి సాగుకూ మొత్తం దేశానికీ అపారమయిన నష్టం కలిగించిన అతిశయోక్తి నివేదికలకూ చెల్లుచీటీ యివ్వడం జరిగింది' అన్నారు బికే అతద్‌జనోవ.

'సహకార యాజమాన్యానికి సంబంధించిన చట్టం స్వేచ్ఛగా చొరవ ప్రదర్శించే వాతావరణాన్ని కల్పించిం'దన్నారు అబ్దుల్లా ఇస్కందిరోవ్. నరిమనోవ్ సమష్టి వ్యవసాయక్షేత్రం అధ్యక్షుడిగా ఉంటున్న ఇస్కందిరోవ్ ఇంకా యిలా చెప్పారు: 'స్వాయత్తాధికారం లభించడంతో, మేం మరింత సమర్థవంతంగా పనిచేస్తున్నాం. మా వనరులను-ముఖ్యంగా భూమిని-మరింత ఎక్కువగా సద్వినియోగం చేసుకుంటున్నాం. గతంలో మొత్తం పొలాలన్నింటా పత్తినే నాటేవారు. ఫలితంగా భూమిలో సారం పోయి చవుడు నేలగా మారిపోయేది. ఇప్పుడు మేం వ్యవసాయక్షేత్రం భూముల్లో పశువుల మేతకోసం గడ్డీ మాకోసం కూరలూ పండించుకుంటున్నాం. అయితే అందువల్ల పత్తి ఉత్పత్తి ఏమాత్రం పడిపోలేదు. పైగా కుటుంబ బృందాలు పెరిగేకొద్దికీ దిగుబడి సామర్థ్యం పెరుగుతూ ఉంది' అన్నారు ఇస్కందిరోవ్.

'ఆజ్ఞాపాలనా, నిధినిషేధాల పాలనాభారం విరగడయి పోవడంతో, నూతన ఆర్థికరంగాలను-ఉదాహరణకు వ్యవసాయ అనుబంధ పరిశ్రమలు లాంటి వాటిని-అభివృద్ధిచేస్తున్నాం. వినియోగ వస్తువుల తయారుచేసే కర్మాగారాలు నిర్మిస్తున్నాం. ఇలాంటి కర్మాగారాలు ఒక్కొక్కదానినుంచీ ఏటా 20 లక్షల రూబుళ్ళ లాభం వస్తుందని మా అంచనా' అని ఇస్కందిరోవ్ తెలిపారు.

ఇప్పుడు చాలా వ్యవసాయ క్షేత్రాలు వ్యవసాయ అనుబంధ పరిశ్రమలను స్థాపిస్తున్నాయి. కొన్ని క్షేత్రాలు ఇటుకల తయారీ ప్రారంభిస్తే ఇతరక్షేత్రాలు అల్లికలు, లక్క, పెయింట్లు లాంటివి తయారు చేస్తున్నాయి. ఇంకా కొన్ని వ్యవసాయ క్షేత్రాలు డబ్బాల్లోనూ, సీసాల్లోనూ పళ్లూ కూరలూ రసాలూ భద్రపరచడానికి సంబంధించిన కర్మాగారాలు స్థాపించాయి. ఆర్థిక కార్యకలాపాలు ముమ్మరం కావడం సానుకూలంగా సామాజిక ప్రభావాన్ని ప్రసరించింది. వ్యవసాయ క్షేత్రాలకు లభించే అదనపు ఆదాయంతో స్కూల్లో శిశు ఆరోగ్యరక్షణా క్షేత్రాలూ వైద్య సాంస్కృతిక కేంద్రాల నిర్మాణంకోసం ఖర్చుచేయడం జరుగుతోందిప్పుడు.

అన్నిటికన్నా ముఖ్యమయిన అంశం మరొకటి ఉంది. మధ్యఆసియా ప్రాంతాల్లో జననాల శాతం చాలా ఎక్కువ. పట్టణాలకు తరలివెళ్ళేవారిశాతం బహు తక్కువ ఫలితంగా నగరాల్లో సిబ్బంది కొరత ఏర్పడి ఉండగా గ్రామసీమల్లో కార్మికులు అవసరమయినదానికన్నా అదనంగానే ఉండేవారు. ఇప్పుడు వ్యవసాయ అనుబంధ పరిశ్రమలను వ్యవసాయక్షేత్రాలే స్థాపించడం, అదనపు సిబ్బంది సమస్య పరిష్కారానికి దోహదం చేస్తోంది. ఏదేమయినా, వ్యవసాయక్షేత్రాలకు స్వాయత్తాధికారం తిరిగి సంపాదించుకోవడ అతి క్లిష్టమయిన క్రమం 'ఆజ్ఞాపన-శాసనపాలన' దురాచారానికి అలవాటుపడిన పాలనా యంత్రాంగం, పోరాటానికి దిగకుండా ఉండదు. ఇప్పటికి మిద్దెలమీదా గద్దెలమీదా అధివసించివున్న అధికారులు రైతులను వేధిస్తూనే ఉన్నారు, తమ పెత్తనం చెలాయించాలనే చూస్తున్నారు. అయితే 'పనిపట్ల వృత్తి నైపుణ్యం' అనే వైఖరి ఏర్పరచుకోవాలని సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 19 వ మహాసభ యిచ్చిన పిలుపును అంతా అర్థంచేసుకుంటారనీ, ఈ వైఖరి దేశ దైనందిన జీవన సూత్రంగా మారుతుందని సమిష్టి వ్యవసాయ క్షేత్రాల రైతులు ఆశిస్తున్నారు.

# సోవియట్ యూనియన్‌లో సంస్కరణల తక్షణావశ్యకత

అకడమీషియన్ ఎల్. అబాల్కిన్
(సోవియట్ విజ్ఞానశాస్త్రాల అకాడమీ తాలూకు
అర్థశాస్త్ర ఇనిస్టిట్యూట్ డైరెక్టర్)

చైనా మొదట వ్యవసాయాన్ని, సేవా పరిశ్రమను, వ్యాపారాన్ని పునర్ వ్యవస్థీకరించి, వనరులను పోగుచేసుకొని ఆ తర్వాతనే 5-8 యేండ్ల కాలంలో పరిశ్రమల్లో సంస్కరణను చేపట్టింది. కాని మీరు అలా కాకుండా సోవియట్ యూనియన్ ఆర్థిక వ్యవస్థను మొత్తంగా ఒకేసారి పునర్ నిర్మించడానికి ఎందుకు పూనుకున్నారని అమెరికన్ అర్థశాస్త్రవేత్తలు యిటీవల నన్ను అడిగారు.

చైనాకు బహుశ 5-8 యేండ్ల వ్యవధి వుండి వుండొచ్చు, కాని మాకు లేదని నేను సమాధానమిచ్చాను. మాకు లభించిన సమయాన్ని మేము వృధా చేశాం, అందువల్ల పరిశ్రమల్లో సంస్కరణను వాయిదా వేయలేం. ఇందుకు మరో ఎనిమిదేళ్ల కాలాన్ని మేము వృధా చేస్తే సాంకేతిక, పారిశ్రామిక అధునాతన శక్తిగా మేము వుండజాలము. అప్పటికి ఒకటి లేదా రెండు తరాల సాంకేతిక పరిజ్ఞానం ఉత్పత్తి పద్ధతులు మారిపోతాయి. వాటిని మేము ఏనాటికీ అందుకోలేము.

మేము త్వరపడాల్సి వచ్చింది. అందువల్లనే ధరల సమస్యను సంస్కరించకుండానే పరిశ్రమాధి సంస్థల్లో పూర్తిస్థాయి ఉత్పత్తి-ఖర్చుల మదింపు పద్ధతిని ప్రవేశపెట్టాం. దీనివల్ల బ్రహ్మాండమైన ఫలితాలు లభిస్తాయని భావించవచ్చు. విజయాలు క్రమక్రమంగా లభిస్తాయి. 1990 ల ప్రారంభంనాటికిగాని ఆర్థిక సంస్కరణలు తుది రూపాన్ని సంతరించుకుంటాయి.

కాలం చెల్లిన సాంకేతిక పరిజ్ఞానంలో రాత్రికి రాత్రే అత్యున్నత ప్రపంచ స్థాయినందుకోలేము. ఇందుకు ప్రప్రథమంగా సముచితమైన సాంకేతిక పునాదిని

నిర్మించుకోవాలి. శ్రామిక బలగాలకు శిక్షణనిచ్చి ప్రవీణులను చేయాలి. దీన్ని త్వరిత్వరగా చేయవచ్చు. కాని అకస్మాత్తుగా చేయలేము.

ప్రపంచంలో సాంకేతిక పురోగతి వేగంగా జరుగుతోంది. ఆర్థిక సంస్కరణలను తక్షణమే చేపట్టడానికిగల కారణాల్లో ఇదొకటి సామాజికాంశం, అంటే ప్రజల మనోభావాలుకూడా నిర్వహించాల్సిన పాత్ర వుంది. ప్రజలు నిరీక్షించి, నిరీక్షించి గాలికబుర్లు విసీ, వినీ విసిగెత్తిపోయారు. ప్రజల మనోభావాలను మొత్తంగా ప్రతిబింబించే, అత్యంత తీవ్రసమస్య యిది.

మరో కారణం, సోవియట్ యూనియన్ వ్యవసాయరంగాన్ని ప్రక్షాళన చేయాల్సిన అవసరం ఎంతో వుంది. పరిశ్రమను సంస్కరించకుండా వ్యవసాయ సంస్కరణలను అమలుజరపడం అసాధ్యం. కొందరు అప్పుడప్పుడు విషయాన్ని చాలా తేలికచేసి చెప్తారు. సమిష్టి వ్యవసాయక్షేత్రాలకు స్వస్తిచెబుదాం. అందులోని సభ్యులందరినీ కుటుంబ కాంట్రాక్టు ప్రకారం పనిలో పెడుదాం. ఒకటి, రెండు సంవత్సరాల్లో మన మన సమస్యలన్నీ తేలిపోతాయి అని వారంటారు. ఫలానా ఫలానా బృందాలు కాంట్రాక్టు పద్ధతి ప్రకారం పనిచేస్తున్నాయి. వాటి ఉత్పాదకత రెట్టింపు అయింది. చూడండి అని అంటారు. ఇది లోతు తెలియని చాలా అమాయక మైన అభిప్రాయం. పాడి పంటల్లో ఉత్పాదకత సమస్యను యీ విధంగా పరిష్కరించలేము. ఉదాహరణకు. కుటుంబ కాంట్రాక్టుద్వారా, అమెరికా సగటున ఒక ఆవునుండి పొందే పాలను మనం పొందలేము. మనం పశు సంతతిని సమూలంగా మెరుగుపర్చాలి లేదా మార్చాలి. పశుగ్రాసోత్పత్తిని పెంచాలి. పంగడాలను, కృషి పద్ధతులను మార్చాలి. కృషి పద్ధతులు పరిశ్రమల పరిస్థితినిబట్టి వుంటాయి. ఇప్పు డున్నదానికి పూర్తి భిన్నమైన వ్యవసాయ యంత్రనిర్మాణ పరిశ్రమ మనకు కావాలి. మనకు మరోవిధమైన ఆధారరంగపరిశ్రమ అవసరం. అంటే మనన్ని మంచి రోడ్లు, ఎలివేటర్లు, కూరగాయలను భద్రపర్చే గిడ్డంగులు, యింకా యితర అనేక సదుపాయాలు, యివన్నీ అధునాతన సాంకేతిక పరిజ్ఞానంతో కూడుకున్నవై వుండాలి.

పరిశ్రమల్లో మార్పు చేయకుండా వ్యవసాయోత్పత్తిని మరో ఎనిమిదేళ్లలో కూడా పెంచలేము.

అందువల్ల నిజంగా విప్లవకర ఆర్థిక సంస్కరణ సోవియట్ యూనియన్‌కు అవసరం. ప్రస్తుత మేనేజిమెంటు వ్యవస్థను రద్దుచేసి. సోషలిస్టు అభివృద్ధిస్థాయికి దీటైన నూతన మేనేజిమెంట్లు సమస్యను నిర్మించ తలపెట్టాం.

అసలు విషయం యిది, ఆర్థిక జీవనంలో, మేనేజిమెంటు రంగంలో సోష లిస్టు సూత్రాలను మనం తరచు వక్రీకరించాం; యింకా వక్రీకరిస్తూనే వున్నాం. ఈ వక్రీకరణలను తొలగించడం, మన సామాజిక వ్యవస్థకుగల శక్తిసామర్థ్యాలకు విస్తృత అవకాశాలను ఆవిష్కరించడం—యిదీ సంస్కరణోద్యమ లక్ష్యం.

ఈ, వక్రీకరణవల్ల, 70 ల నాటి, 80 ల ప్రారంభంనాటి వ్యతిరేక పరిణామాలవల్ల ప్రస్తుత ఆర్థిక సంస్కరణలు అవసరమయ్యాయా? మన అభివృద్ధి లోని చారిత్రక వంకరటింకరవల్ల, తప్పించవీలున్న లేదా వీలులేని యీ వంకర టింకరలవల్ల యిది అవసరమయ్యాయా? అని యెంరైనా అడగవచ్చు.

ఏదేమైనప్పటికీ ప్రస్తుత ఆర్థిక సంస్కరణలు అనివార్యమైనవని నా అభి ప్రాయం. ప్రస్తుత మేనేజిమెంటు యేర్పడినప్పటినుండీ మన ఆర్థిక వ్యవస్థ నాట కీయంగా మారింది. సాంకేతిక రీత్యా పరిధిరీత్యా, సామాజిక దృష్ట్యా యీ క్రమంలో పాల్గొన్న ప్రజల భాగస్వామ్యం దృష్ట్యా చూచినప్పుడు యిది మారింది. ఒకవేళ వక్రీకరణలే లేనిపక్షంలో సంస్కరణ మరోవిధంగా వుండేదనేమాట నిజం. దీన్ని భిన్న పద్ధతుల్లో, భిన్నవేగంతో, తక్కువ శ్రమతో సాధించవీలుండేది.

# సామాజిక న్యాయమా?
# సర్వ సమానత్వమా?

విటాలియ్ దియ్‌మారీస్కియ్

ఆడవాళ్ళ నగల తయారీలో ఎప్పటికప్పుడు ఫ్యాషన్ల ప్రకారం మార్పులెలా వస్తుంటాయో అదే పద్ధతిలో, ఆయాకాలపు ఫ్యాషన్‌కు అనుగుణంగా న్యాయం అనే పదానికి చెప్పే అర్థంకూడా మారుతూ వస్తుందని 17 వ శతాబ్దికి చెందిన మేధావి బ్లెయిజ్‌పాస్కల్ అన్నారు. బహుశా ఫ్యాషన్లు అతిత్వరగానే మారిపోతూ ఉంటాయేమో. దాని మాటెలా వున్నా ప్రతి ఒక్క శకంలోనూ, ప్రతి ఒక్క సామాజిక వ్యవస్థలోనూ ఈ పదానికి కొత్త అర్థం చెప్పకోవడం జరుగుతూ ఉంటుంది.

సోషలిజంలో, సామాజిక న్యాయం అనే పదం - సర్వత్రా ఆమోదం పొందిన - ఒక నూతనార్థాన్ని సంతరించుకుంది. 'ప్రతి ఒక్కరూ శక్తిమేరకు పని చెయ్యడం - పనికి తగిన ప్రతిఫలం పొందడం' అన్నదే ఈ సామాజిక న్యాయానికి సోషలిం చెప్పే అర్థం. అయితే సోషలిస్టు వ్యవస్థ ఈ నిర్వచనాన్ని సంపూర్ణంగా విస్మరించినట్లు కనిపిస్తుంది. సర్వ సమానత్వం అనే భావన దిశగా ప్రజల మనోభావాలు మళ్ళాయి. ఇది ఎంతదాకా పోయిందంటే, సమానత్వం అనే పదాన్ని విచక్షణారహితమయిన సర్వసమానత్వం అనే భావనకు సమానార్థకంగా మార్చేయడం జరిగింది. ఈ పరిణామం వెనక ఎన్నో చారిత్రిక, సామాజిక, రాజకీయ, ఆర్థిక కారణాలు ఉన్నాయి. వీటిని ప్రత్యేకంగా విశ్లేషించడం అవసరం.

ఈ వ్యాసంలో, అక్టోబర్ విప్లవ అనంతర కాలంలో ప్రజల మనోభావాలకు మాత్రమే ప్రాముఖ్యం యిస్తారు. భిన్నమయిన పనులు చేసేవాళ్ళకు భిన్నమయిన వేతనాలు చెల్లించడం - అందరికీ తమ ప్రతిభను ప్రదర్శించేందుకు సమాన హక్కులు కల్పించడం ప్రాతిపదికగా - అనే సూత్రం ఎంతో అర్థవంతంగా న్యాయంగా అనిపించింది ప్రజలకు. ఇది ఎవరో నేర్పి పెట్టిన జ్ఞానంకాదు. ప్రజల్లో సహజంగా తలెత్తిన చైతన్యమే. అయితే, దేశ ప్రజల్లో అత్యధికులు కేవలం

అక్షరజ్ఞానానికి మాత్రమే నోచుకోగా కొద్దిమంది మాత్రం ఏదీ వృత్తుల్లో నైపుణ్యానో, ఉన్నత విద్యనో సాధించి ఉండిన రోజుల్లో సమానత్వం గురించి చెప్పడం హాస్యమే అవుతుందా?

తప్పనిసరిగా తీసుకోవలసిన కొన్ని చర్యలు తీసుకుంటే మాత్రమే సామాజిక న్యాయానికి సంబంధించిన సూత్రాలను పటిష్ఠంగా అమలుచేయడం సాధ్యమవుతుందని జీవిత వాస్తవం మనకు బోధించింది. మొట్టమొదటగా వ్యక్తుల శక్తి సామర్థ్యాలు వికసించే పరిస్థితులు సృష్టించాల్సి ఉంది. రెండోది 'చేసినపని ప్రాతిపదికగా చెల్లింపులు' అనే పద్ధతికి ఉచితమయిన హామీ కల్పించాలి.

అయితే, రెండో చర్య తీసుకోవడంలో చాలా జాప్యం జరిగింది. 1930 లో తలెత్తి 1970 ల వరకూ సాగిస్తూ వచ్చిన 'ఆజ్ఞ - పాలన' విధానం వ్యక్తిపూజ ధోరణికి దారితీసింది. నాయకుడు మినహాయించి మిగిలినవాళ్ళ పాత్రను భారీ యంత్రంలోని చిల్లర మల్లర నట్లూ బోల్టుల స్థాయికి కుదించేసింది ఈ పద్ధతి

1985 లో ప్రారంభమయిన పునర్వ్యవస్థీకరణ ఉద్యమం ఆదాయం పంపిణీపై కేంద్రీకరణ పెంచింది. అంతిమ ఫలితాల ప్రాతిపదికగా ప్రతిఫలం చెల్లింపు, చేసిన పనిలోని నాణ్యతకు అగ్రతాంబూలం అందించడం, అన్నవి నూతన ఆర్థిక వ్యవస్థకు అతిప్రధానమయిన అంశంగా పరిగణించడం మొదలయింది. ఆర్థిక సామర్థ్యం పెంపుదలకు ఈ రెండూ ప్రధాన సాధనాలనే దృష్టికూడా ప్రాచుర్యం పొందింది. కండలు కరిగించే కార్మికుడూ, కాళ్ళు బారచాపుకూర్చునే లోఫరూ సమానవేతనం అందుకునే పరిస్థితికి ఆర్థిక రంగాన్ని సంక్షోభాల సుడిగుండంలోకి నెడుతుంది. కార్మికులకు ప్రోత్సాహకాలు అందుబాటులో లేకుండాచేస్తోంది సామాజిక న్యాయ సూత్రాలను నిర్లక్ష్యం చేస్తోంది. ఎలాగంటే, మార్కెట్‌లో కొరత ఏర్పడ్డంతో దొంగ వర్తకం ఎక్కువవుతుంది. ఫలితంగా ఉన్నతశ్రేణికి చెందిన వాళ్ళకు మాత్రమే పరిమితమయిన స్టోర్‌లూ, ఉన్నతాధికారులకే పరిమితమయ్యే ఆరోగ్య కేంద్రాల్లాంటి కొత్త - న్యాయ విరుద్ధమయిన - పరిణామాలు చోటు చేసుకుంటున్నాయి.

ఇటీవలే జరిగిన ఒక అభిప్రాయ సేకరణ సందర్భంగా, 'పనితో ముడిపడిన వేతన విధానం సామాజిక న్యాయానికి ముఖ్యలక్షణం' అనే అభిప్రాయం ప్రచురంగా, ప్రముఖంగా, వ్యక్తమయింది. దీన్నిబట్టి చూస్తే సోవియట్ ప్రజానీకం, ప్రతిఫలం పంపిణీకి ప్రాధాన్యం పెంచడంపట్ల, సానుకూలంగా స్పందిస్తున్నట్లు తెలుస్తుంది. అయినా ఈ పరిణామంవల్ల ఆదాయ ప్రాతిపదికగా వైవిధ్యం చోటు చేసుకుంటుందికనక, ఈ విషయమయి అభిప్రాయాలు విభేదించవచ్చు. ఈ ఆదాయ వైవిధ్యం అనివార్యమనిపిస్తుంది. ఇంతకుముందు ప్రస్తావించిన అభిప్రాయ సేకరణలో పాల్గొన్నవాళ్ళలో అత్యధికులు 300-500 రూబుళ్ళ వేతనం చాలా పెద్ద

జీతంగా పరిగణిస్తున్నారు. సహకార సంస్థల్లోనూ, వ్యక్తిగత శ్రమ సంస్థల్లోనూ పనిచేసేవాళ్ళకు వ్యతిరేకంగా తరచు తీవ్ర విమర్శలు విన్పించడానికి కారణమేమిటో దీన్నిబట్టి అర్థం చేసుకోవచ్చు. ఈ తరహా వ్యక్తుల ఆదాయం చాలా ఎక్కువగా వుందని అధికుల అభిప్రాయం. ఈ పరిణామం చిరకాలంగా స్థిరపడివున్న సామాజిక న్యాయ సూత్రానికి ఇమడ్డంలేదు. అందుకే విమర్శ వస్తోంది.

దేశంలోని యథాతథవాదులూ, బ్యూరోక్రాట్లూ ఈ తరహా విమర్శలను దుర్వినియోగం చేస్తున్నారు. ప్రస్తుతం దేశంలో సాగుతున్న ఆర్థిక సంస్కరణల క్రమం, తమ పీఠాలకు ముప్పు తెచ్చిపెడుతుందని ఈ శక్తులు బెదిరిపోతున్నాయి. అంచేతనే హడావుడి పడిపోయి, సహకార వాణిజ్య సంస్థలూ వ్యక్తిగత వాణిజ్య సంస్థలూ సోషలిస్టు సూత్రాలకు - అంటే వాళ్ళు చిరకాలంగా చెబుతూవస్తున్న విచక్షణారహితమయిన సర్వసమానత్వ సూత్రాలకు అనే అర్థంలో - భిన్నంలో ఉన్నాయంటూ ముద్ర గుద్దేస్తున్నాయి. ఆదాయాలపై పరిమితి విధించకపోవడం, ఆస్తుల్లో అసమత్వం, నిస్వార్థ కృషినీ సమష్టితత్వాన్నీ బలహీనపరుస్తాయని వీళ్ళు వాదిస్తున్నారు. అలాగే పెటీ బూర్జువా మనస్తత్వం పునరుద్ధరణకు దారితీసే సామాజిక పరిస్థితుల సృష్టికి ఈ పరిణామాలు దారితీస్తాయని యథాతథవాదులు హెచ్చరిస్తున్నారు. సమిష్టితత్వం, నిస్వార్థకృషి అనడంద్వారా ఈ పెద్దలు అసలు సర్వ సమానత్వ భావననే పునర్వచిస్తున్నారని నా ఉద్దేశం. అంటే దారిద్ర్యాన్నే అంతా సమానంగా పంచుకుందామని వీళ్ళు వాదిస్తున్నారన్నమాట. ఆ విధంగా వాళ్లు భావిస్తున్న 'ఆర్థిక ప్రయోజనం' సోషలిస్టు సిద్ధాంతానికే విరుద్ధంగా కనిపిస్తోంది.

అదృష్టవశాత్తూ, ఇలాంటి దృక్పథం విస్తృత ప్రాచుర్యంపొందినా సామాజికార్థిక నిర్ణయాలు తీసుకోవడంలో ప్రముఖపాత్ర వహించలేకపోతున్నాయి. పనికీ ప్రతిఫలానికీ మధ్యన నిష్పత్తి పాటించడం ఈనాడు అత్యధిక ప్రాధాన్యాన్ని సంతరించుకుంది. ఈ నిష్పత్తిని పాటించే సహకార వాణిజ్య సంస్థలూ, ఫ్రీ లాన్సర్ల ఆదర్శాన్ని అనుసరించి సోవియట్ ప్రభుత్వ ఆర్థిక రంగం వివిధ రకాలయిన కంట్రాక్టు సంబంధాలను ప్రవేశపెట్టింది. కౌలు, బృందాలకు, యిచ్చే కంట్రాక్టులను లేదా కుటుంబాలకు కార్మికుడి వ్యక్తిగత ప్రయోజనాల ప్రాతిపదికగా రూపొందించారు. ఇంతవరకూ ఎదురయిన అనుభవాల ఆధారంగా చూస్తే, కార్మికులకో, కార్మిక బృందాలకో కౌలు కిచ్చిన సంస్థల్లో ఉత్పాదకత చెప్పుకోదగిన ప్రమాణంలో పెరిగినట్లూ, సామాజికాభివృద్ధి వేగం పెరిగినట్లూ, సరుకు ఉత్పత్తిలో నాణ్యత, కార్మికుల వేతనాలు పెరిగినట్లు తెలుస్తోంది.

ల్యూథర్ చెప్పిన మాటలొక్కసారి స్మరించుకుందాం : 'నువ్వు పేదవాడిగానే ఉండదల్చుకుంటే సంపదలకోసం తాపత్రయపడకు. సంపాదించాలనుకుంటారా-నాగలి పట్టి చేలోకి దిగు.'

పెరిస్త్రోయికా, గ్లాస్నోస్త్

# ప్రజలకు కావాల్సింది ప్రజాస్వామిక మానవతాయుత సోషలిజం

ఫ్యోదోర్ బుర్లాత్‌స్కీ

ప్రజలకు ఏరకమైన సోషలిజం కావాలి? ఈ ప్రశ్న కమ్యూనిస్టు సూత్రాల నుండీ వైదొలగడంగా కనిపించవచ్చు. కాని, దీన్ని పరిశీలించనారంభిస్తే, ప్రస్తుత సమస్త వాదోపవాదాలూ, చర్చల్లోని ప్రధానాంశం సరిగ్గా యిదే అని తేలుతోంది.

"సోషలిజాన్ని గురించిన మన భావనంతటినీ మనం పునఃపరిశీలిస్తున్నాం" అని లెనిన్ "సైనిక కమ్యూనిజం కావాలి" (1918-1921) తర్వాత అన్నాడు. నిర్మొహమాటంగా చెప్పాలంటే సోవియట్ సమాజం నేడు యిదే సవాలును యెదుర్కొంటోంది. మనం లెనిన్ దృక్పథానికి తిరిగి మళ్ళీ స్టాలిన్ యుగ దుష్ట పర్యవసానాలను ఫలప్రదంగా ఎదుర్కొనాలంటే, యిప్పటికి 70 యేళ్ళనుండి సోషలిజాన్ని నిర్మిస్తున్న ప్రజల ప్రయోజనాలూ, ఆశలూ, ఆకాంక్షలు వాస్తవరూపం ధరించాలంటే, మన అభిప్రాయాలను గురించి తిరిగి ఆలోచించాలి. ఇతర 14 సోషలిస్టు దేశాల అనుభవాన్ని పరిగణనలోనికి తీసుకోవడం, సత్వర సాంకేతిక పురోగమన యుగంలో పెట్టుబడిదారీ దేశాలతో మన పోటీని గురించి వాస్తవికంగా అంచనా వేయడం కూడ అవసరం. ఆధునిక సోషలిజాన్ని గురించిన కొత్త దృక్పథ సారాంశం యిదే.

మనదేశంలో సోషలిజం సన్నగిల్లుతూ రావడానికి కారణమేమిటి? ఇది యెలా జరిగింది. మొదటి విషయం 1920 లలోనే సోషలిజం గురించి రెండు భిన్న దృక్పథాలుండటమే కదా; రెండు భిన్న నమూనాలు వాస్తవంలో పోటీపడ్డాయి.

ఒకటి "సైనిక కమ్యూనిజం." యిది క్రూర అంతర్యుద్ధ కాలంలో నెలకొల్పబడింది. ఇది కమ్యూనిజంలోకి అమాంతంగా దూకెయ్యడం సాధ్యమన్న అర్థ అరాచక ధోరణిని ప్రతిబింబిస్తోంది. ఆచరణలో సర్వత్రా జబర్దస్తీ పాలన,

హింస, రైతులనుంచీ పంటను బలవంతంగా స్వాధీనం చేసుకోవడం, సరకుల సాధారణ మార్పిడిని అంతం చేయడం అని దీనర్థం.

రెండవది నూతన ఆర్థిక విధానం లేకనెఫ్ (1921—1928). యిది ప్రభుత్వ రంగ సంస్థల, సహకార, ప్రైవేటు రంగ సంస్థల మధ్య పోటీని అనుమతించింది. దీని ప్రకారం రైతులు తమ పంటను స్వేచ్ఛగా మార్కెట్‌లో అమ్మి తమ కవ సరమైన తయారీ సరకులను కొన్నారు. నెఫ్‌లో ఉన్న ముఖ్యాంశం ఇదీ: ప్రజా స్వామ్యం ప్రత్యేకించి పార్టీ, ట్రేడ్ యూనియన్లు, సోవియట్లలో అమలు జరిగింది. సంస్కృతి కళారంగాలలో బహువిధ ధోరణులుండేవి.

విముక్తి ఉద్యమం పుట్టినప్పటినుండీ కూడా రెండు విభిన్న ధోరణులు—ఒకవైపు సోషల్ డిమోక్రటిక్ (రష్యాలోని బోల్షివిక్) ధోరణి, మరొకవైపు "సైనిక కమ్యూనిజం" ఉండినాయి. సెయింట్ - సైమన్ ఒకవైపు, బాబ్యూఫ్ మరొకవైపు; మార్క్సు ఒకవైపు, బకూనిన్ మరొకవైపు నిల్చారు. బకూనిన్ దృక్పథం వ్యక్తి విలువను, సర్వత్రా నాగరిక ప్రవర్తన స్వతంత్ర విలువను తిర స్కరించిన బాంకాసుల కమ్యూనిజపు. రోగగ్రస్తమయిన కమ్యూనిజపు వికృత ప్రతిబింబం అని మార్క్సే స్వయంగా వర్ణించారు. అది అట్టడుగు ప్రజల దారిద్ర్యం, అజ్ఞానం, సామాజిక ఈర్ష్యలనుండి పుట్టిందని అన్నారు.

సోవియట్ రష్యాలో బకూనిన్ ధోరణి బలంగా ఉండేది. ప్రజల వెనుక బడిన మనస్తత్వమూ, వారి నియంతృత్వ, పితృస్వామ్య రాజకీయ సంస్కృతి యిందుకు కారణం. లెనిన్ కాలంలో పార్టీ కేంద్ర కమిటీ పొలిట్ బ్యూరోలో కనీసం సగంమంది వామపక్ష కమ్యూనిజం అనబడే ఈ ధోరణికి నిబద్ధులైన వారే ట్రాట్‌స్కీ తన జీవిత పర్యంతం దీన్ని సమర్థించాడు.

ఇక, స్టాలిన్ మొదటినుంచీ ఈ వామపక్ష రాజకీయాలముఖ్య స్రవంతిలోని వాడే. ఆయన టెర్రరిస్టు పద్ధతులను బలపరిచేవాడు. బహుశా ఆయన, నూతన ఆర్థిక విధా నాన్ని "సైనిక కమ్యూనిజం" స్థానంలో వచ్చిన ఈ విధానాన్ని ప్రతిపాదించిన లెనిన్ భావాలను అర్థం చేసుకోలేకపోవడానికి లేక ఉద్దేశ్యపూర్వకంగా నిరాకరించ డానికి బహుశా ఇదే కారణం కావచ్చు.

'స్టాలిన్ 1920 ల ఆరంభంలో ఈ సిద్ధాంతానికి (లెనినిజానికి) తన సొంత వ్యాఖ్యానం చేయసాగారు.

లెనిన్ ప్రకటనలను స్టాలిన్ క్రమంగా ఎలా వక్రీకరించాడో (మొదట రహ స్యంగా, తర్వాత అంతకంతకూ ఎక్కువ బాహాటంగా) తెలుసుకోవడం సులభం. హింసను కీర్తించడమే స్టాలిన్ సైద్ధాంతిక కృషి ఉద్దేశం.

1930 ల ఆరంభంలోనే, స్టాలిన్ చరిత్రలో తన యుగాన్ని పోలిన ఉదాహ రణలను వెతకడంలో ఇవాన్ ది టెరిబుల్, పీటర్ ది గ్రేట్ లాంటి భిన్న వ్యక్తులను.

యించుకోవడం యాదృచ్ఛికమేమీ కాదు. దేశ ఔన్నత్యంకోసం అతి పాశవిక పద్ధతులు ఉపయోగించడం అనివార్యమని రుజువు చేయడానికి స్టాలిన్ వీరి అనుభవాన్ని తీసుకున్నారు.

జాతి ఔన్నత్యం, నాయకుని పాత్ర గురించిన తన భావనలను స్టాలిన్ మార్క్సిస్టు మూలాలనుండీ గాక రష్యా గత అనుభవం నుండీ ఏర్పరచుకొన్నారు.

1939 లో జరిగిన 18 వ పార్టీ మహాసభలో స్టాలిన్, కమ్యూనిజానికి వెంటనే పరివర్తన చెందడానికి సమయమాసన్నమైందని చెప్పారు. అయితే, ఆ కమ్యూనిజం ఎలాంటిదనేది స్పష్టంగా చెప్పలేదు. కాని, ఆచరణలో అది కమ్యూనిస్టు భవితవ్యంలోకి "లంఘన"కు యావత్తు తరాన్ని బలి యివ్వడంగా తేలింది. ఈ విధానం ఆర్థిక వ్యవస్థ విచ్ఛిత్తికీ, సహకార వ్యవసాయ క్షేత్రాలను ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలుగా మార్చే ప్రయత్నాలకూ, ఖైదీలతో పని చేయించడానికీ దారి తీసింది.

స్టాలిన్ తన జీవిత చరమదశలో మళ్ళీ తన కమ్యూనిజంలోకి లంఘన పథకాన్ని లంకించుకొన్నాడు. ప్రత్యక్ష వస్తు మార్పిడికి పరివర్తన చెందడం, సరకులకు సేవలకు చెల్లింపుల పద్ధతిని క్రమక్రమంగా విసర్జించడం, సరకు సంబంధాలను, ద్రవ్య సంబంధాలను పరిమితంచేసి తుదకు రద్దుచేయడం—యివన్నీ ఆయన నిర్దేశించిన తక్షణ లక్ష్యాల్లో కొన్ని.

తన భావాల్లోని తప్పును యితరులకంటే బాగా చూడగల మేధావులపట్ల స్టాలిన్ ప్రత్యేకించి అసహనం కనబర్చేవాడు. రచయితలు, సినీ నిర్మాతలు, కళాకారులపై నిందలు మోపడానికి పదేపదే ప్రచారోద్యమాలను ప్రారంభించేవాడు. మానవతా సమస్యలు, సాంస్కృతిక రంగంలో పోటీ వగైరాలు బూర్జువా భావజాల అవశేషాలుగా పరిగణించబడ్డాయి.

స్టాలిన్ సృష్టించిన వ్యక్తిపూజ భావజాలం, కమ్యూనిజంలోకి దూకెయ్యాలన్న ఆయన ఊహాస్వర్గజనిత భావం దేశాభివృద్ధికి ప్రతిబంధకాలు అయ్యాయి.

విస్తృత సామాజీకరణ అంటే ప్రభుత్వ నియంత్రణే అనుకొని ఆయన సోషలిజాన్ని నిర్మించే కర్తవ్యాన్ని అతి సరళమైనదిగా చేశారు. మొదట్లో ప్రభుత్వ నియంత్రణలో ఒక్క పరిశ్రమ రంగం మాత్రమే వుండేది. తుదకు సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు కూడా ప్రభుత్వ నియంత్రణ కిందికి వచ్చాయి.

ఈ ప్రభుత్వ నియంత్రణ ఆర్థికరంగానికి మాత్రమే పరిమితం కాలేదు. అది క్రమంగా యావత్తు దేశ బౌద్ధిక జీవితానికీ, సాంస్కృతిక సంస్థలకూ, ప్రచురణ, నాటక, విద్యా, ఆరోగ్య సంరక్షణ, క్రీడారంగాలకూ విస్తరించింది. ప్రభుత్వ ఉద్యోగులను ఎన్నికైనవారుగా కాక, యెంచుకోబడిన వారిగా పరిగణించారు.

ప్రభుత్వ పాలన అధికారవర్గ పెత్తందారీ తత్వానికి కారణమిదీ.

స్టాలిన్ హయాం తరువాత మన సిద్ధాంత, ఆచరణలు, హింస సర్వాశ్రిత శక్తిపై నమ్మకాన్ని కమ్యూనిజంలోకి లంఘించాలనే ఉబలాటాన్ని చాల వరకు అధిగమించాయి. "ప్రస్తుత తరం కమ్యూనిజంలో జీవించగలదు" అన్న ఆగా ధావంలో ఉన్న ఆఖరు సోవియట్ నాయకుడు కృశ్చేవ్.

ఒక తరం కాలంలో కమ్యూనిజాన్ని నిర్మిస్తామని వాగ్దానం చేసింది మన మొట్టమొదటి నాయకుడు బ్రెజ్నేవ్ కాని, ఆయన సైతం రాజ్యాంగ యంత్రం పైనా, దాని వ్యవస్థీకరణ సామర్థ్యం పైనా గట్టి నమ్మకముండేవి ఆయన అధికారానికి వచ్చిన తరువాత, కృశ్చేవ్ అవాస్తవిక పథకాల వ్యవహారాలను తొలగించి, పాత పద్ధతులకు మళ్ళితే చాలు, అంతా సజావుగా జరిగిపోతుందని నమ్మాడు. "వ్యవస్థాత్మక ప్రతిస్పందన"పై ఆయన ఆధారపడినంతగా మరే నాయకుడు ఆధారపడలేదు. అందువల్లనే, ఆయన కాలంలో మంత్రిత్వశాఖల సంఖ్య నూటికి పైబడింది. ఇది స్టాలిన్ కాలంలో ఉన్నదానికి మూడింతలు ఎక్కువ.

## కొత్త తరహా సోవియట్ సమాజం

ఇది సాంకేతిక శాస్త్రం శీఘ్రగతిలో పురోగమిస్తున్న కాలం. ఇప్పుడు ప్రభుత్వ సోషలిజానికి కాలం చెల్లింది. అది యెంత మాత్రమూ ఫలితమివ్వదు. అంతర్యుద్ధకాలంలో శృతి మించిన కేంద్రీకరణ, ప్రభుత్వ నిర్బంధం—యివి వనరుల సమీకరణలో, సమస్త కృషిని కూడదీయడంలో తమ పాత్ర నిర్వహించిన మాట నిజమే. కానీ, ఈ పద్ధతి ఇప్పుడు అన్ని రంగాల్లో ప్రగతిని నిరోధిస్తుంది. నేడు ప్రస్తుత పాలనా రూపం మార్చవలసి ఉంది. అది "యావన్మంది ప్రజల స్వయంపాలన సోషలిజం"గా మారాలి. అయితే, ఇది క్రమక్రమంగా జరగవలసిన మార్పు.

ఇంత అపార ప్రకృతి వనరులు, యింత శక్తివంతులు, విద్యావంతులూ అయిన ప్రజలున్నగల దేశంలో తగినంత ఆహారపదార్థాలు, బట్టలు, నాణ్యమైన చలన చిత్రాలు, గ్రంథాలు లేకపోవడానికి కారణమేమని ఆలోచించవలసిన సమయం వచ్చింది. వైఫల్యానికి కారణం నిజంగా మంచి సోషలిజం లేకపోవడమే నని పిస్తోంది. దీన్నిబట్టి, కేంద్రీకృత జాతీయ ప్రభుత్వాన్ని రద్దుచేయాలని అర్థంచేసుకోరాదు. అతి సంక్లిష్టమైన ప్రస్తుత ఆంతరంగిక, అంతర్జాతీయ పరిస్థితుల్లో అలాంటి ప్రతిపాదనకన్న తెలివిమాలినది మరొకటిలేదు. అయితే, చేయవలసినదేమంటే, ప్రభుత్వం తన అధికారాలు, హక్కులు కొన్నింటిని సమాజానికి, దాని సంస్థలకూ, ముఖ్యంగా ఫ్యాక్టరీ కార్మికులకు, సహకార సంస్థలకు, ప్రజాసంఘాలు మొదలైన వాటికి దఖలు పర్చడం.

సైద్ధాంతిక, రాజకీయ రంగాల్లో అన్నిటికన్నా ప్రధానమైనది లెనిన్, మార్క్స్ భావాలపైన, సోషలిజం మూలాలకు మళ్ళడం అని మరొకసారి నొక్కి చెప్పదలచాను. అట్లని వారి వారసత్వానికే మనం మితంకారాదు. తరువాత ప్రపంచం చాలా మారింది. మార్క్స్‌గాని, లెనిన్ గాని కోటానుకోట్ల ప్రజలకు శాశ్వతంగా శిరసావహించడానికై సూత్రాలను, నియమాలను తయారుచేయాలని తల పెట్టలేదు.

మరింత ఫలప్రదమైన, ప్రజాస్వామికమైన, మానవతాయుతమైన కొత్తతరహా సోషలిజం యేమిటి? ప్రస్తుతానికి. మనకు దాని స్థూలరేఖలు మాత్రమే కనిపిస్తున్నాయి. ఆ రేఖలివి : ఖర్చుల మదింపుపైనా, బహువిధ సామాజిక యాజమాన్య రూపాలపైనా ఆధారపడిన ప్రణాళికాబద్ధమైన, సరకుల ఆర్థిక వ్యవస్థ. ప్రభుత్వ యాజమాన్యం యావన్మంది ప్రజల యాజమాన్యంగా రూపొందుతుంది; సహకార, కుటుంబ, వ్యష్టి యాజమాన్య రూపాలు పెంపొందుతాయి ఆరోగ్యకరమైన ఆర్థిక పోటీ ఉంటుంది. రాజ్య వ్యవస్థ సమాజానికి లోనై ఉంటుంది. పార్టీ, ప్రభుత్వ, పౌరసంస్థల అధికారాలు యిదమిద్ధంగా నిర్ధారణ అయి వుంటాయి. స్వయంపాలన అభివృద్ధి చెందుతుంది. ప్రజాభిప్రాయాన్ని రూపుదిద్దడం రాజకీయక్రమంలో ఒక అంశంగా వుంటుంది. ఎన్నికల పద్ధతి ప్రాముఖ్యం పెరుగుతుంది. పెత్తనం, పెద్దరికం స్థానంలో సోషలిస్టు సంస్కృతి నెలకొంటుంది.

ఆధునిక సోషలిజం అభివృద్ధి చెందడానికి ఒక దశాబ్దానికి పైగా పడుతుందనేది స్పష్టమే. విద్వేషపూరితమైన కొన్ని అవరోధాలను మినహాయిస్తే మొత్తం ప్రజ తమ దేశశ్రేయస్సు కోసం, ప్రతి పౌరుని శ్రేయస్సు కోసం పాటుపడే కాలంగా యిది వుంటుంది.

(లితరే పత్రిక నుండి)

# ప్రచార పద్ధతులు-ప్రచార నిర్వహణ

**సత్యపాల్ డాంగ్**

*(కేంద్ర కార్యవర్గ సభ్యులు
భారత కమ్యూనిస్టు పార్టీ)*

పార్టీ, ప్రజా సంఘాల కార్యకలాపాల ప్రచారాన్ని నిర్వహించడం చాల ముఖ్యమైన కర్తవ్యం. కాని, ఈ కర్తవ్యంపట్ల అనేక పార్టీ యూనిట్స్, అలానే అనేక నాయకత్వ స్థానాలలో ఉన్న కామ్రేడ్స్ దృష్టిని సారించవలసినంతగా సారించడం లేదు. "పని, కర్తవ్య నిర్వహణపట్ల మా బాధ్యత. మేమేమి ప్రచారంకోసం ఉన్నవాళ్ళం కామ"ని కూడా కొందరు చెబుతున్నారు. ఒక ముఖ్యమైన రాజకీయ కర్తవ్యంగా. ప్రచార నిర్వహణలోని మన పూర్తి వైఫల్యాన్ని ఇది చూపుతుంది.

దేశం, ప్రజల కొరకు చేసిన పోరాటాలు, ఉత్తమ, నిస్వార్థపూరితమైన పని పార్టీ ప్రతిష్టను. ప్రజాసంఘాల పలుకుబడిని మరింత ఇనుమడింప చేస్తాయి. నూతన శ్రేణులు పార్టీవైపు ఆకర్షితమయ్యేందుకు ఇలాంటి చర్యలు దోహదం చేస్తాయి.

ఇక్కడ ఒక ఉదాహరణ ఇవ్వవచ్చు. టెర్రరిజానికి వ్యతిరేకంగా పంజాబులో మన పార్టీ నడుపుతున్న పోరాటం వలన దేశమంతటా మన పార్టీ ప్రతిష్ట ఎంతగానో పెరిగింది. కమ్యూనిస్టులు, అంతర్జాతీయ వాదులు, విప్లవకారులే కాదు. ఉత్తమ దేశభక్తులున్న విషయాన్ని నూతన శ్రేణులకు చెందిన ప్రజానీకం తెలుసుకొనేందుకు దీనివలన అవకాశం కలిగింది.

ఈ పోరాటంలో అసువులుబాసిన మృతవీరులు చాల కీలకమైన పాత్రను నిర్వహించారు. ఈ త్యాగాలన్నీ పత్రికలలో ప్రతిబింబింపవలసిన అనివార్య పరిస్థితి ఏర్పడింది. అదే సమయంలో. ఈ విషయంలో ప్రచార నిర్వహణకై పార్టీ తీసుకున్న శ్రద్ధ ఎంతగానో తోడ్పడింది.

మరొక వైపునుండి కూడా ప్రచురణ చాల ముఖ్యమైన పని. ఒక రాష్ట్రంలో పలుప్రాంతాలలో కాని లేక వివిధ రాష్ట్రాలలో అనేక పోరాటాలు జరుగుతూ

ఉంటాయి. ఈ సందర్భంగా అనేక నూతన పోరాట రూపాలు ముందుకొస్తాయి. ఈ నూతన రూపాలన్నింటిని కాకపోయిన, కొన్నింటినైనా ఇతర రాష్ట్రాలు అనుసరించవచ్చు ఈ రూపాలలో కొన్నింటికి సార్వత్రిక స్వభావం ఉండవచ్చు. ఈ నూతన పోరాటాలకు తగుప్రచారం లభించినప్పుడే వాటికున్న అవకాశాలు, శక్తియుక్తులు ముందుకు రాగలవు. ఇతరుల అనుభవం నుండి తెలుసుకోవడానికి ప్రచారం ఎంతగానో సహాయ పడుతుంది. ఇలాంటి అధ్యయనం అవసరమన్న విషయాన్ని ఏ కమ్యూనిస్టు విస్మరించలేరు.

విధానం, నిర్ణయాలు. అలానే జరుగుతున్న పోరాటాలు, కార్యక్రమాలకు మద్దతు పొందటానికి కూడా ప్రచారం అవసరం.

పార్టీ ప్రచార యంత్రాంగంలోనే కాక, బూర్జువా ప్రసార సాధనాలలో కూడా ప్రచార నిర్వహణ ఎంతో అవశ్యమన్న విషయంపై చర్చ స్పష్టపరస్తుంది. బూర్జువా పత్రికలు మనకు ఎక్కువ ప్రచారం ఇవ్వవని సాధారణంగా అనడం వాస్తవమే. ఆ మిషతో, అసలు ప్రచారం కొరకు ప్రయత్నాన్నే మానుకోవడం తప్పు. వేర్వేరు సమస్యలమీద, ఆ సమస్యలు సమసిపోకముందే, సకాలంలో మన ప్రకటనలు ఇవ్వగలిగితే ప్రచారం లభిస్తుంది. అలానే ప్రకటనలు క్లుప్తంగాను, సమస్యపైనే కేంద్రీకరించి ఉండడం కూడా ఇందుకు అవసరం. అదే విధంగా, ప్రకటనలు చదవడానికి వీలుగా (టైప్‌చేస్తే) ఉండడం, సకాలంలో వాటి విడుదల చేయడం కూడా ఇందుకు ముఖ్యం. ప్రచారరంగ బాధ్యులు వీటన్నింటిని గురించి తెలుసుకోవడం ఇందుకు అవసరం. పత్రికా రంగానికి వచ్చినప్పుడు. ప్రత్యేకించి దూరదర్శన్ లాంటి అధికార యంత్రాంగంలో ప్రచారం లభించేటట్టు చూసుకోవాలి.

మన ముఖ్య కార్యకలాపాలకు ప్రచారమివ్వడం పత్రికా విలేకరుల, దూరదర్శన సిబ్బంది యొక్క విధిగా కొంతమంది పార్టీ కార్యకర్తలు భావిస్తుంటారు. ఇది హానికరం. పెద్ద పెద్ద కార్యకలాపాలు జరుగుతున్నప్పుడు, ఆయా రంగాల ప్రచార ప్రతినిధులకు మనం తెలియపరచాలి. వారిని సాదరపూర్వకంగా ఆహ్వానించాలి. అలానే మిగతా విషయాలలో పత్రికా ప్రకటనలను దూరదర్శన్ ప్రతినిధులకు పంపాలి ఇదే పద్ధతి రేడియోకు కూడా వర్తిస్తుంది.

పార్టీ పత్రికలలో కూడా ప్రచారానికి సంబంధించిన సమస్యలున్నాయి. ఇంతకుముందే పేర్కొన్నట్టు, ఇలాంటి సమస్యలను గురించి కూడా కొంతమంది కార్యకర్తలు, పార్టీ యూనిట్స్ పట్టించుకోరు. ఇందుకు భిన్నంగా పెడధోరణులు, తప్పుడు మార్గాలను అనుసరించడం కూడా జరుగుతుంది. పార్టీ పత్రికలలోని వార్తలలో తమ పేర్లు కనిపించకపోతే కోపగించుకొనే కొంతమంది కార్యకర్తలు కూడా ఉన్నారు. తాము వేదిక నిర్వాహకులనూ లేక వక్తలలో ఒకరనో లేక

గాయన బృందంలో సభ్యులనో అన్న దానితో వారికి నిమిత్తం లేదు. మరి కొంత మంది, తమ ఉపన్యాసం సుదీర్ఘంగా పత్రికలో అచ్చవ్వాలను కొంటారు. ఇలాంటి ఉపన్యాస పాఠం ఏదో ఒక రూపంలో ఇంతకుముందే సుదీర్ఘంగా పత్రికలో వచ్చినప్పటికి కూడా. నాయకుల అభిష్టానుసారం పార్టీ పత్రికలు వారి వార్తలను ప్రచురించినప్పుడు, వారి ప్రసంగ పాఠంలోని నూతనాంశాలు పాఠకుల దృష్టినుండి తప్పించుకునేందుకు అవకాశం ఉంది నూతన అంశాలమీద, రూపాలమీద, మన ప్రచార కేంద్రీకరణ జరగాలి వ్యాసాల పరిధికంటే ఉపన్యాసాల పాఠం పరిధి పూర్తిగా భిన్నమైంది. కొన్ని విషయాలు పార్టీ పత్రికలలో తప్పనిసరిగా రావలసి ఉంటాయి. వీటిని బూర్జువా పత్రికా రంగం విస్మరించవచ్చు. వీటినే కాకుండా, అటు పార్టీ పత్రికలు, ఇటు ఇతర పత్రికలను దృష్టిలో ఉంచుకొని ప్రకటనలను రూపొందించుకోవడం మంచిది.

ప్రచార నిర్వహణకు అవసరమైన కనీసపు ఖర్చుకు వెనుకాడరాదు. ప్రధాన జిల్లా పార్టీలు, వారి వారి బడ్జెట్ కేటాయింపులలో ప్రచురణ నిర్వహణకు కూడా డబ్బు కేటాయించాలి. ప్రచారం పేరుతో డబ్బుని వృధాగా వ్యయించడం మానుకోవాలి. ఈ క్రింది ఉదాహరణ దీనిని మరింత స్పష్టపరచగలదు. పార్టీ ప్రదేశ్ సమితి ఆధ్వర్యంలో ఒక రాజకీయ శిక్షణ శిబిరం జరుగుతుందని అనుకొందాం. ఈ శిబిరాన్ని ఒక పెద్ద నాయకుడు ప్రారంభించి, ప్రారంభోపన్యాసంలో జనాసక్తి కలిగిన కొన్ని కొత్త విషయాలు చెబితేతప్ప, పత్రికా రంగం మన రాజకీయ శిక్షణా శిబిరాలకు ఎలాంటి ప్రచారం ఇవ్వదు. ఈ విషయాన్ని సాధారణంగా అర్థం చేసుకోవచ్చు. కాని, కొన్ని సందర్భాలలో పార్టీ శిక్షణా శిబిర ప్రారంభోత్సవానికి సంబంధించి పార్టీ పత్రికలలో ప్రచారం అవసరమని భావిస్తారు. ఎక్కడో దూరంగా వున్న పత్రికా కేంద్ర కార్యాలయానికి ఫోన్ ద్వారా ఈ వార్తను చెప్పారనుకుందాం. తమ అవసరాలు కొన్ని మానుకొని పత్రికా నిర్వహణకు తోడ్పడిన కార్మికవర్గపు ధనాన్ని మనం వృధాగా వ్యయించినట్టే కాగలదు. మరి కొన్ని ఉదాహరణలు ఇవ్వడం అవసరం లేదు.

ప్రచారానికి సంబంధించిన మరొక అంశంపైన, అనేక సంవత్సరాలుగా ఒక వివాదం కొనసాగుతుంది. బహిరంగ సభలకు, ప్రదర్శనలకు హాజరైన వారి సంఖ్యను అతిశయించి చెప్పడం ఎంతవరకు సమంజసం? సమంజసమైతే, ఏ మేరకు అతిశయించి చెప్పవచ్చు? ఇటీవల ఒక కేంద్రంలో వెయ్యిమంది వ్యవసాయ కార్మికులు అరెస్టయ్యారు. అరెస్టయిన వారి సంఖ్య మూడు వేలని పత్రికలో వచ్చింది. ఇది తప్పా లేక ఒప్పా? ఒకసారి ప్రజాప్రదర్శన జరిగింది. దీనిలో 20 వేలమంది పాల్గొన్నారు. ఈ సంఖ్య ఒక లక్షగా పత్రికలో వచ్చింది. దీనికి కొంత మంది కామ్రేడ్స్ అభ్యంతరం తెలిపారు. "ఒక బూర్జువా పత్రిక ప్రదర్శకుల

సంఖ్య ఒక లక్షని పేర్కొంది. మన మెందుకు దాన్ని తక్కువ చెప్పాలి?" అని దీనికి సమాధానం ఇచ్చారు. దీనితో పార్టీ నివేదికలలో, పత్రాలలో ప్రదర్శకుల సంఖ్యా లక్షగా స్థిరపడిపోయింది.

ఇలాంటి అతిశయోక్తులు సరికాదని మన అభిప్రాయం. ఇలాంటి ధోరణి వలన అతిశయంతోకూడిన అభిప్రాయాలు మన శ్రేణులకు కలుగుతుంది. అలానే ఇది వాస్తవాలను వక్రీకరించడం కూడా కాగలదు. పార్టీయేతరులలో, మన ప్రచారం పట్ల నమ్మకం సన్నగిల్లుతుంది. కొద్ది మాత్రంగా అతిశయోక్తులు ఉండవచ్చా? మామూలుగా చెప్పాలంటే, వీలైనంతవరకూ సంఖ్యను ప్రస్తావించకుండా ఉండడం మంచిది. పెద్ద ప్రదర్శనను పెద్ద ప్రదర్శనగా చెప్పవచ్చు ఆయా సందర్భాను సారం—హాజరైన వారి సంఖ్యనుబట్టి సభకు వేలలో లేక వందలలో ప్రజలు హాజరైనారని చెప్పవచ్చు. ప్రచారానికి ఇతర మార్గాలు కూడా ఉన్నాయి. ఉదాహరణకు ప్రదర్శన మార్గంలో ఒక పాయింట్‌ను దాటటానికి ఎంత సమయం పట్టింది. ఒక వేళ సంఖ్య ఇస్తే, అది వాస్తవానికి దరిదాపులలో ఉండాలి.

(ఏది ఏమైనా, పార్టీ నివేదికలలో, పత్రాలలో అతిశయోక్తులు ఉండరాదు.)

చివరగా, ఏదైనా ఒక విషయంలో అధికార యంత్రాంగం ఇవ్వవలసినంత ప్రచారం ఇవ్వకపోతే, ఈ విషయాన్ని మన పార్లమెంటు సభ్యుల ద్వారా ప్రభుత్వ దృష్టికి తీసుకెళ్ళాలి. సమస్యకాని ఇంకా పెద్దదైతే, పార్లమెంటులో దాని మీద ఆందోళన జరపవచ్చు.

### పార్టీ జాతీయ సమితి తీర్మానం

# రాజీవ్‌గాంధీ ప్రభుత్వాన్ని తొలగించడమే ప్రధాన లక్ష్యం

భారత కమ్యూనిస్టుపార్టీ జాతీయ సమితి అక్టోబరు 12 నుంచి 25 వ తారీకు వరకు న్యూఢిల్లీలో సమావేశమైంది. భారత కమ్యూనిస్టు పార్టీ కర్నాటక రాష్ట్ర సమితి కార్యదర్శి శ్రీ ఎం.ఎస్. కృష్ణన్ సమావేశానికి అధ్యక్షత వహించారు.

గత సమావేశం తరువాత జరిగిన రాజకీయ పరిణామాలపై జాతీయ సమితి నివేదికను ఆమోదించింది. ఇంకా అనేక ఇతర వర్తమాన సమస్యలపై కూడా పలు తీర్మానాలను ఆమోదించింది. మతతత్వ పరిస్థితిపైనా, వరదలపైనా శ్రీలంకపైనా ఆంధ్రప్రదేశ్‌లో తెలుగుదేశం పార్టీ మంత్రివర్గం టెర్రరిస్టు వ్యతిరేక చట్టాన్ని దుర్వినియోగ పరుస్తుండడంపైనా జాతీయ సమితి తీర్మానాలు ఆమోదించింది.

పార్టీ కార్యక్రమం కమిషన్ సమర్పించిన నివేదికను చర్చించి జరగబోయే జాతీయ సమితి సమావేశంలో చర్చకుగాను ముసాయిదాను ప్రవేశపెట్టాల్సిందిగా జాతీయ సమితి సూచించింది. 1988 డిసెంబరు 21,22,23,24 తారీకుల్లో జాతీయ సమితి తరువాతి సమావేశం జరుగుతుంది.

1989 మార్చి 6 నుంచి 12వ తారీకు వరకు జరగబోయే పార్టీ మహాసభను నిర్వహించాలని జాతీయ సమితి నిర్ణయించింది.

రానున్న పార్టీ మహాసభలో చర్చించబోయే రెండు డాక్యుమెంట్లకు అంటే రాజకీయ తీర్మానానికి, పార్టీ కార్యక్రమం ముసాయిదాకు డిసెంబరులో జరగబోయే జాతీయ సమితి సమావేశం తుదిరూపం ఇస్తుంది.

జాతీయ సమితి శ్రీ ఇంద్రజిత్ గుప్తాను జాతీయ సమితి ఉపప్రధాన కార్యదర్శిగా ఎన్నుకొంది.

# అంతర్జాతీయ రంగంలో సానుకూల ధోరణులు

జాతీయ సమితి అంతర్జాతీయ పరిస్థితిని సమీక్షిస్తూ సామ్రాజ్యవాదులు, ఇతర ప్రగతినిరోధక శక్తులు ఎన్ని అవరోధాలను సృష్టిస్తున్నప్పటికీ "నూతన సానుకూల ధోరణులు కొనసాగుతాయని" పేర్కొంది.

సామ్రాజ్యవాదులు, ఇతర అభివృద్ధి నిరోధక శక్తులు బుద్ధిపూర్వకంగా అవరోధాలు సృష్టిస్తున్నప్పటికీ (ఈ శక్తులను ఎన్నడూ తక్కువ అంచనా వేయరాదు) అంతర్జాతీయ రంగంలో సానుకూల ధోరణులు కొగసాగుతూనే వున్నాయి.

సోవియట్ యూనియన్, తదితర సోషలిస్టు దేశాల శాంతి చొరవల యొక్క, అలీన శిబిరం పాత్రయొక్క నిరాయుధీకరణ చొరవకు ప్రపంచ ప్రజాభిప్రాయం అవగాహనకు అధికాధికంగా అనుకూలంగా మారిర వాతావరణం పాత్రయొక్క సమాహార ఫలితం యేమిటంటే అంతర్జాతీయ సహకారం, శాంతియుత సహజీవనం ప్రాతిపదికపై యేర్పాటయ్యే సమగ్ర భద్రతా వ్యవస్థచేత ప్రపంచ యుద్ధప్రమాదం నివారించబడగలదు, నివారించబడి తీరాలి.

సామ్రాజ్యవాదుల కుతంత్రాలపట్లనూ, భరోసా ధోరణి లక్షణాలపట్లనూ అప్రమత్తంగా వుంటూనే మనమొక వాస్తవాన్ని గమనించకుండా వుండలేము. మూడు నాలుగేళ్ళక్రితం ఆలోచించడానికే వీల్లేని దిశగా ప్రపంచం మారుతున్న వాస్తవాన్ని మనం గమనించకుండా వుండలేము. 1988లో సాధింపబడిన విజయాలు ఈ విషయాన్ని స్పష్టం చేస్తున్నాయి.

ఉదాహరణలు :

1) మధ్యంతర, సమీపశ్రేణి మిసిలీల నిర్మూలనకు అవకాశం కలిగించే ఐ.ఎన్.ఎఫ్. ఒప్పందం అమలుకు శ్రీకారం చుట్టిన మాస్కో శిఖరాగ్ర సభ;

2) ఆఫ్ఘనిస్తాన్ సమస్యపై రాజకీయ పరిష్కారానికి జెనీవా ఒప్పందాలు కుదుర్చుకోవడం;

3) అణు మిసిలీలను ప్రప్రథమంగా బహిరంగంగా నిర్మూలించడం;

4) ఇరాన్—ఇరాక్ యుద్ధంలో కాల్పుల విరమణ;

5) నైరుతి ఆఫ్రికాలో కాల్పుల విరమణకు నమీబియాకు స్వాతంత్ర్యం సిద్ధింపచేయడానికీ నాలుగుదేశాల చర్చలు నిర్వహించడం (అమెరికా మధ్యవర్తిగా అంగోలా, క్యూబా, దక్షిణాఫ్రికాలు)

6) కంపూచియాలో రాజకీయ పరిష్కృతి దిశగా పురోగతి

7) ఉభయ కొరియాల శాంతియుత పునరేకీకరణకు అనుకూలంగా పెరుగుతున్న ప్రయత్నాలు.

8) విభజింపబడిన సైప్రస్‌లోని గ్రీక్, టర్కీ జాతుల నాయకులమధ్య ప్రత్యక్ష సంప్రదింపులు;

9) ఐక్య కృషిద్వారా అంతర్జాతీయ వివాదాల పరిష్కృతికి ప్రధాన కేంద్రంగా ఐక్యరాజ్యసమితి పనితీరు మెరుగుపడడమూ, దాని నిమగ్నత బాగా పెరగడమూను.

10) చిలీలో ఫాసిస్టు పినోచెట్ పాలనకు వ్యతిరేకంగా ప్రజాతంత్ర శక్తులు విజయం సాధించడం.

కొన్నేళ్ళ క్రితం వున్న పరిస్థితికంటే నేటి పరిస్థితిలో స్పష్టంగా మెరుగుదల ఉన్నట్లు యీ పరిణామాలన్నీ నిరూపిస్తున్నాయి. ప్రజానీకాన్ని మరింతగా సమీకరించడం ద్వారానూ, ముఖ్యమైన రాష్ట్రాల్లోని విధాన నిర్ణేతలపై మరింత ప్రజావత్తిడి తీసుకురావడం ద్వారానూ ఇంకా ముందుకు పురోగమించడం సాధ్యమా అనే విశ్వాసాన్ని శాంతి, ప్రగతి శక్తులను ఈ పరిణామాలిచ్చి తీరతాయి.

ఈ నేపథ్యంలో మిహాయిల్ గోర్బచెవ్ జరపబోతున్న భారత పర్యటన ముఖ్యమైన ఘటనగా వుంటుంది. ఆయన పర్యటన భారత్-సోవియట్ యూనియన్‌ల మధ్య సహకారాన్ని అంతర్జాతీయ పరిస్థితిలోని సానుకూల అంశాలనూ మరింత పెంచుతుంది. ఈ సందర్భంగా శాంతి, నిరాయుధీకరణ, అభివృద్ధి. భద్రతలకోసం సర్వశాంతి శక్తులూ విస్తృత ప్రచారోద్యమం నిర్వహించాలి.

అమెరికా సామ్రాజ్యవాద వర్గాల ప్రోద్బలంతో పాకిస్తాన్ జెనీవా ఒప్పందాలను ఉల్లంఘించడం కొనసాగిస్తున్నందుకు జాతీయ సమితి ఆందోళన వ్యక్తం చేసింది. అధ్యక్షుడు నజీబుల్లా నాయకత్వంలోని ఆఫ్ఘనిస్తాన్ ప్రభుత్వమే అస్థిర కారకుల ప్రధాన దాడి లక్ష్యమని, యీ అస్థిరకారకులు కాబూల్‌లో ప్రగతి నిరోధక, మతఛాందస వాద ప్రభుత్వాన్ని నెలకొల్పా లనుకుంటున్నారని జాతీయ సమితి నొక్కి చెప్పింది. అలాటి ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయడమే జరిగితే ఇతరేతర పర్యవసానాలతోపాటు అది భారత జాతీయ ప్రయోజనాలను సైతం దెబ్బతీస్తుంది; రాజీవ్‌గాంధీ ఈ విషయమై స్పష్టంగా చెప్పారు కూడా.

ఆఫ్ఘనిస్తాన్‌పై జెనీవా ఒప్పందాలకు తోడ్పాటుగానూ, ఆ ఒప్పందాలను ఉల్లంఘిస్తున్న వారి నీచమైన పన్నాగాలను ఎండగట్టడానికి బలీయమైన ప్రచారోద్య

మాన్ని నిర్వహించాల్సిన ఆవశ్యకత వున్నదని జాతీయ సమితి నొక్కి చెప్పింది.

అఫ్ఘనిస్తాన్, కంపూచియా, నికరాగ్వా వగైరా ప్రాంతీయ ఘర్షణల పరిష్కృతికి అనుకూలంగా ఆవిర్భవించిన ధోరణిని జాతీయ సమితి గమనించింది; గోర్బచెవ్ ప్రతిపాదించిన సోవియట్ చొరవను అభినందించింది ఆసియా–పసిఫిక్ ప్రాంతానికి ఉద్దేశించబడిన ఏడు అంశాల శాంతి కార్యక్రమాన్ని జాతీయ సమితి బలపరిచింది. మిహాయిర్ గోర్బచెవ్ సైబీరియాలోని క్రాస్నో యార్స్క్‌లో సెప్టెంబరు 16 న చేసిన ప్రసంగంలో ఆ ఏడు అంశాల శాంతి కార్యక్రమం వెల్లడింపబడింది.

పశ్చిమతీరంలోనూ, గాజా ప్రాంతంలోనూ ఇజ్రాయిల్ సాగిస్తున్న అత్యాచారాలను జాతీయ సమితి నిశితంగా ఖండించింది; పి.యల్.ఓ. నాయకత్వంలో పాలస్తీనా ప్రజలు చేస్తున్న స్వతంత్ర రాజ్యం డిమాండును బలపరిచింది; పశ్చిమాసియా సమస్య పరిష్కారానికి అంతర్జాతీయ సమావేశాన్ని యేర్పాటు చేయాలని డిమాండ్ చేసింది.

## పొరుగు దేశాలు

పాకిస్తాన్‌లోని ఇటీవలి పరిణామాలను ప్రస్తావిస్తూ, సైనిక పాలనను వ్యతిరేకించే, పార్లమెంటరీ ప్రజాస్వామ్య పునరుద్ధరణను కాంక్షించే శక్తుల బలం పెరుగుతున్నదని భారత కమ్యూనిస్టుపార్టీ జాతీయ సమితి పేర్కొంది. ఇంకా ఇలా అంది: "రానున్న వారాలలో పాకిస్తాన్ చరిత్రలో ప్రాముఖ్యమైన నూతన ఘటన దర్శనమిస్తుంది. ఫలితం యేదైనప్పటికీ, అది భారత దేశానికి అత్యంత ప్రాముఖ్యమైనదిగా వుంటుంది. పార్లమెంటరీ ప్రజాస్వామ్య పునరుద్ధరణ అన్నది ప్రజాతంత్ర శక్తుల, శ్రమజీవులు కొత్తగా బలపడటానికి కీలకమైన అంశంగా వుండగలదు. పాకిస్తాన్‌లోని ప్రజాతంత్ర శక్తులకు, శ్రమజీవులకు అనుకూలంగా మనం మన దేశంలో సంఘీభావాన్ని, సౌహార్ద భావాన్ని పెంపొందించాలి.

ప్రధాని రాజీవ్‌గాంధీ చేయ తలపెట్టిన చైనా పర్యటనను జాతీయ సమితి హర్షించింది; వాణిజ్యం, పరిశ్రమలు, వ్యవసాయం, శాస్త్ర, సంస్కృతీ రంగాల్లో సహకారాన్ని ఆ పర్యటన ఉత్తేజపరుస్తుందన్న ఆశాభావాన్ని వ్యక్తం చేసింది.

ఏదిఏమైనా సరిహద్దు వివాదం పరిష్కరింపబడాలంటే చాలాకాలం పట్టవచ్చునని తెలుపుతూ, ఆయుధశక్తిద్వారాకాక సంప్రదింపుల ద్వారా మాత్రమే అంతిమ పరిష్కారం లభిస్తుందని ఉభయపక్షాలు అంగీకరించాయని" జాతీయ సమితి రాజీవ్

పర్యటనను వ్యతిరేకిస్తున్న 'అతిజాతీయవాదుల' పట్ల, జాతీయ దురహంకారులపట్ల జాగ్రత్తగా వుండాలని హెచ్చరించింది.

బంగ్లాదేశ్ ఘటనలను ప్రస్తావిస్తూ ప్రజాస్వామ్య పునరుద్ధరణ కోసం సాగే ప్రజోద్యమంలో కొద్దిపాటి విరామ ఛాయలు వున్నప్పటికీ, ప్రజాతంత్ర శక్తులను పటిష్టపరిచే దిశగా బంగ్లాదేశ్ కమ్యూనిస్టు పార్టీ తీవ్రంగా కృషి సాగిస్తున్నదని జాతీయసమితి స్పష్టీకరించింది.

ఇటీవల బంగ్లాదేశ్ అధ్యక్షుడు ఎర్షాద్ ఢిల్లీ వచ్చిన సందర్భంగా కుదిరిన అవగాహన ప్రకారం జలాల నిర్వహణపైనా, వరదల నిరోధంపైనా సంయుక్త బృందాన్ని ఏర్పాటు చేసినందుకు జాతీయసమితి హర్షం వ్యక్తం చేసింది.

అయితే బంగ్లాదేశ్ ప్రభుత్వంలోని కొన్ని విభాగాలు భారత వ్యతిరేక ప్రచారాన్ని రెచ్చగొట్టేందుకు చేస్తున్న ప్రయత్నాలపట్ల ఆందోళన వ్యక్తం చేసింది.

శ్రీలంకలోని ఘటనలపై చర్చిస్తూ గత సంవత్సరం కుదుర్చుకున్న భారత-శ్రీలంక ఒప్పందంపట్ల తోడ్పాటును పునరుద్ఘాటిస్తూనే ఆ ఒప్పందం అమలుకు ఎల్. టి. టి. ఇ. విచ్ఛిన్నకర ధోరణులూ, సింహళ జాతీయ దురహంకారుల విచ్ఛిన్నకర ధోరణులూ అవరోధంగా తయారయ్యాయని జాతీయ సమితి స్పష్టం చేసింది. ఈ నేపథ్యం దృష్ట్యానూ, అధ్యక్షపదవికి ప్రేమదాస, శ్రీమతి సిరిమావో బండారు నాయకేలు పోటీ చేసే అభ్యర్థులుగా ప్రకటనలు వచ్చినందువల్లనూ "భారత ప్రయోజనాల దృష్ట్యా భారత శాంతిసేనల ఉపసంహరణ క్రమాన్ని ప్రారంభించాల్సిన సమయం ఆసన్నమైందని" జాతీయ సమితి అభిప్రాయపడింది.

భారత కమ్యూనిస్టు పార్టీ జాతీయ సమితి బర్మా వర్తమాన ఘటనలను పరిశీలిస్తూ "బహుళపార్టీ వ్యవస్థ పునరుద్ధరింపబడి చివరకు రంగూన్‌లో ఎన్నికైన ప్రజాతంత్ర ప్రభుత్వం ఏర్పాటవుతుందన్న" ఆశాభావాన్ని వ్యక్తం చేసింది. భారత-బర్మా సంబంధాలు మెరుగుపడాలన్న ఆశాభావాన్ని కూడా వ్యక్తం చేసింది.

## ఉపఖండ పరిస్థితి

ఉపఖండంలోని ఘటనలను సంక్షిప్తంగా సమీక్షిస్తూ జాతీయసమితి ఇలా స్పష్టీకరించింది. "ఉపఖండంలోని దేశాలు కుతకుత ఉడుకుతున్న పరిస్థితిలో వున్నాయి. ప్రజాతంత్ర సంస్కరణలకోసం, మానవ హక్కులకోసం ప్రజలు ముందుకెళ్తున్నారు. ఐక్యనాయకత్వాన స్పష్టమైన కార్యక్రమం చేపట్టినట్టి ఉద్యమాలను విచ్ఛిన్నం చేయడానికీ, అణచివేయడానికీ సామ్రాజ్యవాదుల ప్రోద్బలంతో ప్రగతినిరోధక శక్తులు తమకు చేతనైనంతల్లా చేస్తాయి. ప్రజాతంత్ర శక్తులు,

లౌకికవాద శక్తులు ఆధిక్యత సంపాదించేందుకు మనం మనకు సాధ్యమైనది చేయాలి."

## పెరిస్త్రోయికాకు తోడ్పాటు

గోర్బచెవ్ నాయకత్వాన సోవియట్ యూనియన్‌లో సాగుతున్న లోతైన క్రమాలను జాతీయ సమితి పరిశీలించింది. అది ఇలా అంది :

"జూన్ ఆఖరు ప్రాంతంలో మాస్కోలో జరిగిన 19 వ ప్రత్యేక సమావేశం ఆమోదించిన తీర్మానాలను అమలుపరచడానికి ప్రస్తుతం సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం తదనంతర చర్యల్లో నిమగ్నమైవుంది.

"ప్రపంచ వ్యాపితంగా సోషలిజాన్ని మరింత ఆకర్షవంతమైనదిగా చేసినట్టి, ఇంకా చేయనున్నట్టి క్రమాలను, ప్రజాతంత్ర సంస్కరణలను, నూతన రాజకీయ భావాలను సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ నేతృత్వం ప్రారంభించింది. సోషలిజం నిర్మాణంలోనూ, ప్రతిష్టంభన శృంఖలాలను బద్దలు కొట్టడంలోనూ నూతన శిఖరాలు సాధించే ప్రగాఢమైన మార్క్సిస్టు-లెనినిస్టు సూత్రాలపై ఉత్పత్తి శక్తుల అభివృద్ధిని గుణాత్మకంగానూ, పరిమాణాత్మకంగానూ వేగిరపరచడం ఆధారపడివుంది.

"అందుచేత మేము పెరిస్త్రోయికా ప్రధాన దిశాభిముఖాన్ని హర్షిస్తున్నాం. అంటే దీని అర్థం, విమర్శ పేరుతోనూ, ఆత్మవిమర్శ పేరుతోనూ వివిధ పత్రికలు రాస్తున్న ప్రతిదానినీ వివిధ వ్యక్తులు చేస్తున్న ప్రతి ప్రసంగాన్ని మనం ఆమోదించాలని కాదు చివరకు సోవియట్ సమాజం లోపలే వక్తృల, ఘటనల అంచనాలపై భీషణమైన వివాదాలు వస్తున్నాయి."

## జాతీయ పరిణామాలు

రాజీవ్‌గాంధీ ప్రభుత్వం కొనసాగిస్తున్న ప్రజాతంత్ర వ్యతిరేక, ప్రజా వ్యతిరేక విధానాలనూ కాంగ్రెస్ (ఐ) యేతర రాష్ట్ర ప్రభుత్వాలపట్ల అవలంబిస్తున్న వివక్షాపూర్వక విధానాలనూ జాతీయ సమితి తీవ్రంగా ఖండించింది.

పార్లమెంటు గత సమావేశం సందర్భంగా మనం, రాజ్యాంగానికి చేర్చబడిన అశుభసూచకమైన 59 వ సవరణను చూశాం; (పంజాబ్ పరిస్థితి సాకు చూపి ఆ పని చేశారు) పైగా జాతీయ భద్రతా చట్టానికి మరింత తిరోగమన సవరణలు చేర్చబడ్డాయి; దాదాపు మొత్తంగా ట్రేడ్ యూనియన్ ఉద్యమం పూర్తిగా వ్యతిరేకించినప్పటికీ పారిశ్రామిక వివాదాల చట్టాన్ని, ట్రేడ్ యూనియన్ చట్టాన్ని సవరించడానికి బిల్లు ప్రవేశపెట్టారు. బీహార్‌లో హరిజనులపై పదేపదే సాగుతున్న హత్యా

క్రాందల పట్ల యీ ప్రభుత్వం పూర్తి అలక్ష్యధోరణి అవలంబిస్తున్నది. గవర్నర్లను పాక్షిక ప్రయోజనాలకోసం, ప్రజాతంత్ర వ్యతిరేక ప్రయోజనాల కోసం వినియోగించుకున్నారు. తమిళ రాష్ట్ర శాసనసభకు ఎన్నికలను తిరిగి వాయిదావేశారు.

ప్రాముఖ్యతలో చివరిది కాదు కానీ వరుసలో చివరిదైన విషయం — ప్రభుత్వం పరువునష్టం అనబడే బిల్లు ద్వారా చేసిన తీవ్రమైన అణచివేంపు చర్య మూలంగా ప్రజాతంత్ర భావాలుగల అన్ని విభాగాలు ప్రభుత్వంతో తలపాటుకు దిగవలసివచ్చింది. మొత్తం పత్రికా రంగమే ప్రభుత్వంతో ఘర్షణకు దిగక తప్పలేదు. ఈ పరిస్థితి సెప్టెంబరు 7 వ తారీకున మొత్తం పత్రికారంగం సమ్మెకు దారితీసింది.

రాజీవ్‌గాంధీ సలహాదార్ల బృందంలో అహంభావం స్థానంలో భయం చోటు చేసుకొంది. వారి కుహనా ప్రతిష్టాభావం కుప్పకూలిపోయింది. చివరకు ఆ బిల్లును ఉపసంహరించుకోవలసి వచ్చింది. అప్పటికే ఆ బిల్లును లోక్‌సభ ఆమోదించి వుండింది. సంబంధితులందరూ యీ ఘటన నుంచి ముఖ్యమైన పాఠాలు నేర్చుకోవాలి. నియంతృత్వ ప్రవర్తనకు వ్యతిరేకంగా విస్తృత ప్రాతిపదికపై ప్రతిఘటనా శక్తులను కూడగట్టితే పాలకవర్గం ఎలా వెనకడుగు వేయక తప్పని పరిస్థితి తలెత్తుతుందో యీ ఘటన నిరూపిస్తున్నది.

బాబర్ మసీదు—రామజన్మభూమి సమస్యపట్లనూ, పంజాబ్ సమస్యపట్లనూ ప్రభుత్వం అవలంబిస్తున్న వూగిసలాట ధోరణిని జాతీయ సమితి విమర్శించింది.

## ఆర్థిక విధానాలు

భారత కమ్యూనిస్టు పార్టీ జాతీయ సమితి రాజీవ్‌గాంధీ ప్రభుత్వం అవలంబించే ఆర్థిక విధానాలను కూడా నిశితంగా విమర్శించింది. సడలించిన ఎగుమతుల విధానం, బడా పెట్టుబడిదార్లకు కొత్త రాయితీలు, పౌర పంపిణీ వ్యవస్థను నిర్మించడంలో వైఫల్యం, ఆహారధాన్యాల్లో ప్రభుత్వ వాణిజ్యం లేకపోవడాన్ని, ధరలు' నిరుద్యోగం అధికాధికంగా పెరగడానికి దారితీసే ఇతరేతర విధానాలు వగైరాలను జాతీయ సమితి విమర్శించింది.

ఈ తిరోగమన ఆర్థిక విధానాలకు వ్యతిరేకంగా పోరాడాల్సిన తక్షణావశ్యకత వున్నదని నొక్కిచెప్పింది.

ప్రజలు పెద్దయెత్తున రాజీవ్‌గాంధీ ప్రభుత్వం నుంచి కాంగ్రెస్ (ఐ) నుంచి దూరమైపోతున్నారు. రాజీవ్‌గాంధీని, కాంగ్రెస్ (ఐ) ని అధికారం నుంచి తొలగించి పారేయాలని ఆత్రంగా వున్నారు. ఈ లక్ష్యాన్ని సాధించే నిజమైన అవకాశం

తలెత్తుతున్నది. ఈ పరిస్థితిలో కాంగ్రెస్ (ఐ) ని ఓడించి, దానిని అధికారం నుంచి తొలగించడమే మన ప్రధాన లక్ష్యంగా వుండాలి.

## జాతీయ సంఘటన, జనతాదళ్‌ల పట్ల మన వైఖరి

బూర్జువా ప్రతిపక్షంలోని పరిణామాలను, జాతీయ సంఘటన, జనతాదళ్‌ల ఏర్పాటునూ జాతీయ సమితి చర్చించింది.

ఈ పరిస్థితిలో కొత్తగా ఆవిర్భవించిన జాతీయ సంఘటనలో జనతాపార్టీ, లోక్‌దళ్, జనమోర్చా, కాంగ్రెస్ (ఎస్) లతో పాటు తెలుగుదేశం పార్టీ, అస్సాం గణతంత్ర పరిషత్, డి.ఎం.కె. లాటి ప్రాంతీయ పార్టీలు కూడా వున్నాయి. ఎన్నికల్లో పోటీ చేయడానికి సాధ్యమైనచోట, అవసరమైనచోట అటు వామపక్ష పార్టీలతోనూ, ఇటు బి.జె.పి తోనూ కొన్ని సర్దుబాటు చేసుకోడానికి యీ సంఘటన విస్తృత వేదికగా పనిచేస్తుందని భావిస్తున్నారు.

బి.జె.పి., శివసేన, ముస్లింలీగ్ వగైరా మతతత్వ పార్టీలను జాతీయ సంఘటన తనలో చేర్చుకోని వాస్తవాన్ని పేర్కొంటూ కార్యక్రమాల వైఖరులకు సంబంధించి జాతీయ సమితి జాతీయ సంఘటనను విమర్శించింది. జాతీయ సంఘటనకు చెందిన పార్టీల నాయకత్వంలోని రాష్ట్రప్రభుత్వాల పనితీరును కూడా జాతీయ సమితి విమర్శించింది. అది ఇలా అంది :

"విదేశాంగ విధానం, రాజీవ్‌గాంధీ ప్రభుత్వం అవలంబించే తిరోగమన ఆర్థిక విధానాలులాటి కొన్ని ముఖ్యమైన సమస్యలపైనా, అదేవిధంగా మనదేశ లౌకిక, ప్రజాతంత్ర వ్యవస్థకూ ఐక్యతకూ ముప్పుగా తయారైన మత తత్వ, మతఛాందస వాద శక్తుల ఆవిర్భావం సమస్యపట్లనూ సంఘటన కార్యక్రమం అస్పష్టంగా వున్నదని చెప్పక తప్పదు. పంజాబ్ సమస్య, బాబర్ మసీదు – రామజన్మ సమస్య లాంటి జాతీయ సమస్యలపై జాతీయ సంఘటన వైఖరిని స్పష్టంచేయడానికి ప్రయత్నించ లేదు.

"సతి, దేవాలయాల్లో హరిజనులకు ఆరాధించేందుకుగల అధికారం వగైరా సమస్యలపట్ల అచ్చంగా కాంగ్రెస్ (ఐ) లాగే జాతీయ సంఘటన కూడా అవకాశ వాద వైఖరి అవలంబిస్తున్నది. సంఘటనలోని కొన్ని భాగస్వామ్య పార్టీలకు సామాజిక సంస్కరణ సమస్యలపై ప్రగతినిరోధక భావాలున్నాయి

"సంఘటన ప్రజానీకంలో తన విశ్వసనీయతను స్థిరపరచుకోవాలంటే సంఘటనలోని భాగస్వామ్య పార్టీలు నడిపే ప్రభుత్వాలు తీవ్రమైన భూసంస్కరణలు, అధికధరలను అరికట్టడానికి పౌర పంపిణీ వ్యవస్థ నిర్వహణ, ప్రభుత్వ నిర్వహణలో ప్రజాతంత్ర సూత్రాలను, రూపాలను పాటించడం వగైరా కార్య

క్రమాలను అమలుపరచాలి. అవినీతి కార్యకలాపాలకు వ్యతిరేకంగా పోరాడాలి. ఈ విధంగా చేయడం ద్వారా వారు కాంగ్రెస్ (ఐ)కి మంచి ప్రత్యామ్నాయాన్ని అందించగలరు."

అయితే దురదృష్టవశాత్తు కాంగ్రెస్ (ఐ) యేతర, వామపక్షేతర రాష్ట్ర ప్రభుత్వాలు ఇంతవరకూ ప్రజల ఆశలను తీర్చడం జరగలేదు.

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావు, హర్యానా ముఖ్యమంత్రి శ్రీ దేవీలాల్‌లు ప్రతిపాదిస్తున్న రెండు పార్టీల వ్యవస్థ భావనపట్ల జాతీయ సమితి తన వ్యతిరేకతను వ్యక్తం చేసింది. వాస్తవానికి ఆ భావన యొక్క పదును కాంగ్రెస్ (ఐ)కి వ్యతిరేకంగా మాత్రమే ఎక్కుపెట్టబడలేదు. అది వామ పక్ష పార్టీలను వెనక్కు తోసేయడానికి ఉద్దేశించబడింది కూడాను.

వాటిలో కొన్నిలోపాలున్నప్పటికీ, కొన్ని సమస్యలపై తటపటాయింపుల ధోరణి వ్యక్తం చేస్తున్నప్పటికీ మొత్తానికి జనతా దళ్‌లోని భాగస్వామ్య పార్టీల పట్ల జాతీయ సమితి సానుకూల వైఖరి చేపట్టింది. జాతీయ సమితి యిలాఅంది :

"వాటిని అస్పృశ్య పార్టీలుగా పరిగణించడం తప్పు. అందులో చాలాఎక్కువ పార్టీలు ప్రజాతంత్ర సమస్యలపై రాజీవ్‌గాంధీ ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాటం సాగిస్తున్నాయి. అవి స్థూలంగా లౌకికవాద దృక్పథంగలవి. ఆ పార్టీల శ్రేణుల్లో మిత వాద ఫ్యూడల్ అనుకూల కోరలులు, లౌకిక వ్యతిరేక సానుభూతులు వున్నవారు కొద్దిమందివున్నప్పటికీ అవి స్థూలంగా లౌకికవాద దృక్పథంగలవి అనడం సత్యం."

జనతాదళ్ కార్యక్రమాన్ని ప్రస్తావిస్తూ కొన్ని సమస్యలపై (ఉదాహరణకు విదేశాంగ విధానం, లౌకికవాదం, మైనారిటీల హక్కులు) ఆ కార్యక్రమం సరైన దశలోనే వున్నదని భారత కమ్యూనిస్టుపార్టీ జాతీయ సమితి పేర్కొంది.

జాతీయ సమితి డాక్యుమెంటులో యిలా వుంది : "ఈ సంక్లిష్ట పరిస్థితిలో, వామపక్ష పార్టీల శక్తుల మధ్య నికరమైన సామ్రాజ్యవాద వ్యతిరేక, ఫ్యూడల్ వ్యతిరేక గుత్త వ్యతిరేక, మతతత్వ వ్యతిరేక, ప్రజాతంత్రయుత కార్యక్రమంపై వామపక్షాలతో సహకరించకోరే ప్రజాతంత్ర శక్తుల, వాదుల మధ్య ఐక్యత కోసం జాతీయ స్థాయి రాజకీయ ప్రచారోద్యమాన్ని నిర్వహించాల్సిన తక్షణావశ్యకత భారత కమ్యూనిస్టుపార్టీకి ఎదురైంది."

జాతీయ సమితి యిలా నొక్కిచెప్పింది : "రెడీమేడ్ (సిద్ధంగావున్న) ప్రత్యామ్నాయమేదీ ఆకాశం నుంచి వూడిపడదు. అడుగుతీసి అడుగువేసే క్రమంలో దానిని నిర్మించుకోవాలి. కమ్యూనిస్టుపార్టీలు కోరుకుంటున్న తరహా వామ పక్ష ప్రజాతంత్ర, లౌకికవాద సంఘటన వచ్చే సార్వత్రిక ఎన్నికలనాటికి దేశ

వ్యాపితంగా వాస్తవ రూపం దాల్చబోవటం లేదు. కాబట్టి పాలకపార్టీని ఓడించా లన్నా, అదే సమయంలో వామపక్షాలు తమ శాసనసభా అస్తిత్వాన్ని మెరుగుపరుచు కోవాలన్నా ప్రస్తుత వ్యవస్థలో మైత్రీ పార్టీలతో సర్దుబాట్లు అనివార్యం."

## ప్రజా ప్రచారోద్యమాలు

వామపక్ష పార్టీలు, వాటి గ్రామీణ ప్రాంత ప్రజా సంఘాలు, ఇతరేతర ట్రేడ్ యూనియన్లు ఈ దశలో నిర్వహించిన ప్రజా ప్రచారోద్యమాలను జాతీయ సమితి సమీక్షించింది జాతీయ సమితి ఇలా స్పష్టంచేసింది.

"ఎన్నికల వ్యూహాగానాల్లోనూ, బహుళ పార్టీ సంప్రదింపుల్లోనూ బూర్జువా పార్టీలు అతిగా నిమగ్నంకాగా అందుకు వ్యతిరేకంగా వామపక్ష పార్టీలు గత నెలలో శ్రామిక రైతుల, గ్రామీణ పేదల, భూమిలేని పేదల తక్షణ డిమాండ్లపై సమర శీల పోరాటాలు నిర్వహించేందుకు స్వతంత్రంగా జనరాశులను సమీకరించేందుకు ముందుకెళ్లాయి."

"దేశ వ్యాపితంగా సాగిన పికెటింగుల్లోనూ, ఘెరావ్‌ల్లోనూ, రాస్తారోకో పోరాటాల్లోనూ 14 లక్షల మంది ప్రజలు పాల్గొన్నారని జాతీయ సమితి వెల్లడించింది.

ప్రగతి నిరోధక పారిశ్రామిక సంబంధాల బిల్లుకు వ్యతిరేకంగానూ, ఆసు పత్రులు తదితర సంస్థలకు సంబంధించి తెచ్చిన బిల్లుకు వ్యతిరేకంగానూ, కార్మిక వర్గం పోరాడిందనీ అదేవిధంగా ఏ.ఐ.టి.ఇ.ఏ., ఎన్.సి.టి.ఇ. నేతృత్వాన పోరా టాలు సాగాయని జాతీయ సమితి తెలిపింది.

## పంజాబ్ సంక్షోభం

జాతీయ సమితి కొనసాగుతున్న పంజాబ్ సంక్షోభాన్నివిమర్శించింది: రాజీవ్, లాంగోవాల్ ఒప్పందం పరిధిలో అన్ని రాజకీయ పార్టీల సహాయం స్వీకరించి రాజ కీయ పరిష్కృతిని కనుగొనడంలో విఫలమైనందుకూ, తీవ్రమైన నేరారోపణలు లేనట్టి జోధ్‌పూర్ డిటెన్యూలందరినీ విడుదలచేయడంలో విఫలమైనందుకూ 1984లో ఢిల్లీలోనూ, ఇతర చోట్ల జరిగిన సిక్కు వ్యతిరేక గొడవలకు బాధ్యులైనవారిపై చర్యలు తీసుకోవడంలో విఫలమైనందుకు ప్రభుత్వాన్ని విమర్శించింది.

ఇటీవల తీసుకున్న కొన్ని ఆర్థిక చర్యలను హర్షిస్తూనే "విఫలమైపోయినప్ప టికీ. మొత్తానికి టెర్రరిస్టుల్లోని ఏదో ఒక విభాగంతో రాజీ కుదుర్చుకోడానికి" ప్రభు త్వం చేసిన ప్రయత్నాన్ని జాతీయ సమితి విమర్శించింది.

జాతీయ సమితి ఇలా పేర్కొంది : పంజాబ్ పార్టీ నాయకుల సహాయంతో మన పార్టీ అఖిల భారత పంజాబ్ సంఘీభావ ప్రచారోద్యమాన్ని విజయవంతంగా నిర్వహించింది. పంజాబ్ పార్టీ నాయకులు అనేక రాష్ట్రాల్లో పర్యటించి పలు సభల్లో ప్రసంగించారు పంజాబ్ కార్మికులు సాగిస్తున్న సాహసోపేత పోరాటానికి సహాయ పడడానికి ప్రారంభించిన పంజాబ్ సంఘీభావనిధికి దండిగా మొత్తాలు స్వీకరించారు. ఈ ప్రచారోద్యమాన్ని కొనసాగించాలి. ఈ ప్రచారోద్యమం పట్ల వ్యక్తమవుతున్న ఉత్సాహపూరిత ప్రజాసంస్పందన ఈ పరిస్థితిలో మనకెంతో సంతృప్తి కలిగిస్తున్నది. ప్రస్తుతానికి ఈ విషయంలో వెనకబడివున్న రాష్ట్రాలు ఈ ప్రచారోద్యమాన్ని తీవ్రంగా చేపట్టాలి.

ఖలిస్తానీ టెర్రరిస్టుల, పాక్ పాలకుల మధ్య భవిష్యత్ సంబంధాలను ఇప్పుడే అంచనావేయడం తొందరపాటే కాగలదు. అమెరికా తాబేదారు జియావుల్ హక్ లేడు. నవంబరు 16 న జరుగుతాయని ప్రకటింపబడిన ఎన్నికలు నూతన పరిస్థితిని సృష్టించవచ్చు: ఆ పరిస్థితిని జాగ్రత్తగా గమనించవలసివుంది.

## మతఛాందసవాదుల ప్రమాదం

త్వరత్వరగా క్షీణిస్తున్న మతతత్వ పరిస్థితి ప్రమాదం పట్లనూ, పెరుగుతున్న మతఛాందస వాదం. మతోన్మాదం పట్లనూ, హరిజనులకు దేవాలయ ప్రవేశం నిరాకరింప బడుతున్నందుకూ జాతీయ సమితి తీవ్రమైన ఆందోళన వ్యక్తం చేసింది: ఈ అన్ని విషయాల్లోనూ ప్రభుత్వ వైఫల్యాలను నిశితంగా విమర్శించింది.

జాతీయ సమితి యింకా యిలా అంది : మత ఛాందసవాదశక్తులు చాదస్తపు విశ్వాసాలను, ఆచారాలను కీర్తిస్తూ తమ కార్యకలాపాలను ఉధృతం చేశాయి ఈ విషయంలో ప్రేక్షకుల ప్రోత్సాహం వారికి లభించిదనడం స్పష్టమే. శిక్షార్హమైన నేరాలయిన "సతి" అస్పృశ్యతలు పరిహాసాస్పదంగా తయారయ్యాయి.

పూరీ శంకరాచార్యులు "సతి" తాలూకు సలక్షణాలను ప్రచారం చేయడం కొనసాగిస్తూనే వున్నాడు. తనపై చర్య తీసుకోరు. ప్రధాని తనను ఖండించరు అన్నధీమాతోనే ఆయన అలా కొనసాగిస్తున్నాడు. ఉదయపూర్‌లోని నాధ్వారా దేవాలయంలోకి హరిజనులు ప్రవేశించబోగా వారిపై దాడి జరగడం గమనిస్తే సమాజం ఎంతగా పతనమైపోయిందో తెలుస్తుంది. ఈ వివాదం నుంచి స్వామి అగ్నివేష్ మాత్రమే కాస్త గౌరవంగా బయటపడ్డాడు.

ముఖ్యంగా బాబర్ మసీదు రామజన్మభూమి వివాదాన్ని పరిష్కరించడంలో విఫలమైనందుకు ప్రభుత్వాన్ని జాతీయ సమితి విమర్శించింది. జాతీయ సమితి

ఇలా హెచ్చరించింది : "ప్రస్తుత రాజకీయ పరిస్థితి దేశంలో ఓ బలమైన హిందూ జాతీయ దురహంకార అంతర్ శక్తిని సృష్టించింది. ఇక బి.జె.పి, ఆర్.ఎస్.ఎస్, శివసేన, బైరాంగ్‌దళ్, విశ్వహిందూ పరిషత్ వగైరాలు యీ పరిస్థితిని ఆధారం చేసుకుని సన్నిహిత మవుతూ మన రిపబ్లిక్ లౌకికవాద పునాదికే ముప్పు తెస్తు న్నాయి. ఇలాటి మతతత్వ శక్తులకు వ్యతిరేకంగా మనం నిర్విరామ పోరాటం కొన సాగించాలి."

ముస్లింలీగ్, జమాత్ ఇ-ఇస్లామీ, ఇత్తేహదుల్ ముస్లిమీన్ లాటివి కూడా ముస్లిముల్లో మతతత్వాన్ని ప్రకోపింప చేస్తున్నాయని జాతీయ సమితి పేర్కొంది.

దేశం యొక్క లౌకిక ప్రజాతంత్ర వ్యవస్థను కాపాడ్డానికి లౌకిక శక్తులు బలమైన దేశవ్యాపిత ప్రచారోద్యమాన్ని నిర్మించాలని జాతీయ సమితి విజ్ఞప్తి చేసింది.

---

## కర్తవ్యాలు

పార్టీ యూనిట్లు ఈ క్రింది కర్తవ్యాలను నిర్వర్తించాలని భారత కమ్యూనిస్టు పార్టీ జాతీయ సమితి నిర్దేశించింది.

(1) తక్షణ సమస్యల ప్రాతిపదికపై స్థానిక, జిల్లా, రాష్ట్ర స్థాయిల్లో గ్రామీణ శ్రమజీవుల పోరాటాన్ని బలోపేతంగా కొనసాగించాలి;

(2) రాష్ట్రాల్లోనూ, క్రింది స్థాయిల్లోనూ మతతత్వ వ్యతిరేక ప్రచారోద్య మాన్ని తీవ్రంగా కొనసాగించాలి;

(3) పంజాబ్ సమస్యపై ఇప్పటికి ప్రారంభించబడిన జాతీయ ప్రచారోద్య మాన్ని అన్ని రాష్ట్రాల్లోనూ బలోపేతంగా చేపట్టాలి;

(4) అత్యవసర సరకుల అధిక ధరలకు వ్యతిరేకంగానూ, ఫలప్రదమైన పౌర పంపిణీ వ్యవస్థ కోసమూ, ఆహార ధాన్యాల్లో ప్రభుత్వ వాణిజ్యం కోసమూ సాధ్యమైనంత విస్తృత స్థాయిలో ప్రచారాందోళనను నిరంతరాయంగా కొన సాగించాలి.

(5) యువతీయువకులు నిరుద్యోగానికి వ్యతిరేకంగా ప్రారంభించిన జాతీయ ప్రచారోద్యమానికి క్రియాశీలమైన సహకారాన్నీ, సంఘీభావాన్నీ పార్టీ అంద చేయాలి.

(6) భారత ఐక్యతకు, సమగ్రతకు, భద్రతకు గల ప్రమాదానికి ఎక్కువ ప్రాముఖ్యమిస్తూ సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రచారోద్యమాన్ని కొనసాగించాలి.

(7) తాలూకాస్థాయి పార్టీ మహాసభల నుంచి పైస్థాయి మహాసభలతో పాటు ప్రజా ప్రదర్శనలు, సభలు నిర్వహించడం ద్వారా పై సమస్యలను వెలుగులోకి తీసుకురావాలి.



*COMMUNISM* (Telugu Monthly) *Regd. No. H/VJ 3/78*

మా నూతన ప్రచురణలు

# పెరిస్త్రోయికా

— గోర్బచేవ్

వెల : రూ. 30-00

ప్రచురణ :



**విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్**

**విజ్ఞాన్ భవన్, 4-1-435, బ్యాంక్ స్ట్రీట్**

**హైదరాబాద్ - 500 001**

## విశాలాంధ్ర బుక్ హౌస్

విజయవాడ, హైదరాబాద్, విశాఖపట్టణం, కాకినాడ,

గుంటూరు, తిరుపతి, అనంతపురం, హన్మకొండ.

**Edited and Published by E. Nageswara Rao for the A. P. Council of C.P.I.**
**Himayat Nagar, Hyderabad.**
**Printed by him at Swatantra Art Printers, Vijayawada-4.**



**మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KRSA101M145 |
| పుస్తకం పేరు | కమ్యూనిజం |
| తారీఖు | 23 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 81 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI, BCI |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Vedavathi |
| పేజీలు విడదీసినది | Vedavathi |
| స్కాన్ చేసినది | Saranya |
| పరీక్ష చేసినది | NAVYA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |